Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 3 • 20-1-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



## చిరుతో రానున్న చిక్కు

చిరంజీవికి కేంద్రంలో మంత్రి కావాలని కోరిక. అందుకోసం రేపు కె.కేశవ రావుతో పాటుగా ఖాళీ అయ్యే రాజ్యసభ సభ్యత్వాల మీద ఆశ పెట్టుకొని వున్నాడాయన. చిరుకు రాజ్యసభ ఇవ్వడం అంటే, కేంద్రంలో మంత్రిత్వం ఖాయం అని అర్థం. ప్రజారాజ్యం విలీనం సమయంలో జరిగిన ఒప్పందంలో అదొక భాగమని చెప్తారు. అయితే దీనితో ముఖ్యమంత్రికి రెండు సమస్యలున్నాయి. మొదటిది – తిరుపతి టౌన్ ఉప ఎన్నిక. అక్కడ కాంగ్రెస్‌ను గెలిపించడం అంత సులభం కాదు. చిరంజీవికి పాత పలుకుబడి లేదు. ముఖ్యమంత్రికి అసలే లేదు. తన స్వంత జిల్లాలో ఉప ఎన్నికలో ఓడిపోయాడనే నింద పైన వేసుకొంటే, బొత్సా వంటి వారు ఆ సాకు చూపి తన కుర్చీ క్రిందకు నీళ్లు తెస్తారని భయం.

రెండవ సమస్య – చిరు ఢిల్లీలో మంత్రిగా నిలదొక్కుకొంటే, బొత్సాకు అక్కడొక అడ్డా దొరుకుతుంది. దాని వల్ల ఎన్నో సమస్యలు. అందువల్ల ఎట్లయినా చిరంజీవిని రాష్ట్ర క్యాబినెట్‌లోకి తీసుకోవాలని ప్రయత్నం చేశాడు కిరణ్‌కుమార్‌రెడ్డి. మంచి శాఖ ఇస్తానని ఆశ చూపాడు. కానీ చిరు ప్రలోభ పడలేదు. తన మనుషులిద్దరికీ మంచి శాఖలతో మంత్రిత్వాలు ఇప్పించుకొన్నాడు.

## కార్టూన్ స్కేప్

నాన్న అడుగు జాడల్లో నడుస్తా – బాలకృష్ణ
నందు

ఇవే... నాన్నగారి అడుగుజాడలు వెన్నుపోటుదారుని అడుగులు కూడా వున్నాయి. చూసి నడవండి సార్!

### ముఖం మాడ్చుకొని ఢిల్లీ నుంచి వెనుదిరగాల్సి వచ్చింది

# కిరణ్ మాట వినని అధిష్టానం!

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డికి రోజులు బాగాలేవు. మంత్రివర్గ విస్తరణ తన ఇష్ట ప్రకారం జరిపించుకోవాలని కలలు కన్నాడాయన. తద్వారా తన పీఠాన్ని పదిల పరచుకోవాలని కోరుకొన్నాడు. కానీ అధిష్టానం ఆయన ఆశలకు గండి కొట్టింది. ముఖ్యమంత్రి కంటే, పిసిసి అధ్యక్షుడు బొత్సా సత్తిబాబు మాటకు విలువ ఇచ్చింది. పాపం, కిరణ్‌కుమార్‌రెడ్డి ముఖం మాడ్చుకొని ఢిల్లీ నుంచి వెనుదిరిగి వచ్చాడు.

చిరంజీవి ఎమ్మెల్యేలు ఇద్దరికి మంత్రివర్గంలో స్థానం కల్పించమన్నది అధిష్టానం ఆదేశం. చిరు పార్టీని కాంగ్రెస్‌లో విలీనం చేసేటప్పుడు జరిగిన ఒప్పందంలో అదొక భాగం. ఆ విలీనం జరగకుంటే చంద్రబాబు సృష్టించిన అవిశ్వాస గండం నుంచి ప్రభుత్వం గట్టెక్కేది కాదు. కుప్పకూలి పోయేది. అయితే ఈ ఇద్దరి చేరిక సమయంలోనే మొత్తం మంత్రివర్గాన్ని తన ఇష్టానుసారం మలచుకోవాలన్నది కిరణ్‌కుమార్‌రెడ్డి కోరిక. ఆయన ముఖ్యమంత్రి అయ్యేనాడు పరిస్థితులు వేరు. వైఎస్, రోశయ్యల మంత్రివర్గాన్నే తాను కొనసాగించవలసి వచ్చింది. దానివల్ల ఎన్నో చీకాకులు. సగం మంది మంత్రులు మాట వినడం లేదు. శంకరరావు వంటి వారు రోజూ ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెడుతున్నారు. జానారెడ్డి, డిఎల్.రవీంద్రరెడ్డి, బొత్సా సత్తిబాబు, ఆనం రామనారాయణరెడ్డి వంటి సీనియర్లు ముఖ్యమంత్రిని లెక్క చేయడం లేదు. నువ్వు మాకంటే జూనియర్ అనే చులకన భావంతో చూస్తున్నారు. దాని వల్ల ప్రభుత్వాన్ని నడపడంలో, కాంగ్రెస్‌కు పునరుజ్జీవం కల్పించడానికి ఆయన తలపెట్టే పథకాలను క్యాబినెట్ సమావేశాలలోనే వ్యతిరేకిస్తున్నారు. ఈ పరిస్థితి తప్పించుకొని, ముఖ్యమంత్రిగా తాను బలిష్టంగా తయారు కావాలంటే చీకాకు పెట్టేవారిని తీసిపారేసి, మాట వినే వారిని చేర్చుకోవాలని తలపెట్టాడు ముఖ్యమంత్రి. కానీ అధిష్టానం అందుకు ఒప్పుకోలేదు.

### బొత్సాది పై చెయ్యి

కిరణ్ ఆశలకు గండి కొట్టడంలో పిసిసి అధ్యక్షుడు బొత్సా సత్తిబాబు కీలక పాత్ర పోషించాడు. ఇప్పుడు మంత్రివర్గంలో పెద్ద మార్పులు చేస్తే అసమ్మతి పుట్టుకొస్తుందని, దాన్ని నియంత్రించే శక్తి కిరణ్‌కు లేదని, దాని వల్ల ఉప ఎన్నికలలో పార్టీ నష్టపోతుందని, జగన్ లాభపడతాడని అధిష్టానాన్ని బొత్సా నచ్చ చెప్పాడు. ఢిల్లీ పెద్దలు ఆయన మాటకే విలువ ఇచ్చారు. దానితో బొత్సా శిబిరం చాలా సంతోషంగా వుంది. ముఖ్యమంత్రిని నియంత్రించే శక్తి తమకున్నదని రుజువు చేసుకొన్నామని ఆనందపడుతున్నది.

### శాఖల మార్పూ వద్దన్నారు

ఉన్న వారిని తీసి, కొత్తవారిని వేసుకోవడం వీలుకానప్పుడు కనీసం మంత్రుల శాఖలు మార్చడానికైనా అనుమతి ఇవ్వమని కోరాడు కిరణ్. కానీ దానికీ ఢిల్లీ ఒప్పుకోలేదు. ఇప్పుడిప్పుడే ప్రభుత్వం స్థిరపడుతున్నదన్న వాతావరణం ఏర్పడుతున్నప్పుడు, చీకాకులు ఏవీ వద్దని ఖరాఖండిగా చెప్పింది.

### శంకరరావు ఇరకాటం

అయితే, ఒక్క శంకరరావు ఉద్వాసనకు మాత్రం అధిష్టానం ఒప్పుకొన్నది. జగన్ మీద కేసుల వరకు ఆయన పార్టీకి ఉపకారం చేసినా, ఆ తర్వాత ఆయన చేసే ప్రకటనలు, వేసే పిచ్చి వేషాలు ప్రభుత్వాన్ని నవ్వుల పాలు చేస్తున్నాయి. ఆయన్ను మంత్రివర్గంలో కొనసాగిస్తే, పరువు మిగలదన్న నిజాన్ని అధిష్టానం కూడా అంగీకరించింది. అయితే శంకరరావు ఈ దశలో కూడా కిరణ్‌తో ఆటలాడుతున్నాడు. ఆయన స్వచ్ఛందంగా రాజీనామా చేయాలని ఢిల్లీ నుంచి మోతీలాల్ ఓరా ఫోన్ చేసి చెప్పాడు. అయితే శంకరరావు అందుకు ఒప్పుకోలేదు. అప్పటి నుంచి ఫోన్ ఆపేసి, ఎవరికీ దొరకకుండా షాద్‌నగర్ వెళ్లి, అధికారులతో సమీక్షా సమావేశం నిర్వహించాడు. తనను ముఖ్యమంత్రి బర్తరఫ్ చేయాలే తప్ప, తాను రాజీనామా చేయనన్నది ఆయన వాదన. ఈ ఇరకాటం నుంచి కిరణ్ ఎట్లా బయటపడతాడో వేచి చూడాలి.

### ముందున్నది ముసళ్ల పండగ

మొత్తానికి కిరణ్‌కు ఢిల్లీ వర్గాలలో మాట పలుకుబడి లేదని అర్థమైపోయింది. తమకంటే జూనియర్ అనే చులకనతో ఇప్పటికే ఆయన్ను ఇబ్బంది పెడుతున్న సీనియర్ మంత్రులు ముందు ముందు మరింత రెచ్చి పోతారన్నది వాస్తవం. ఏ రోజుకు ఆ రోజు ప్రభుత్వాన్ని నడపడం కష్టంగా పరిణమించే పరిస్థితి తలెత్తింది దీని వల్ల. ఈ సమస్యను అధిష్టానం ఎట్లా పరిష్కరిస్తుందో తెలియదు.

# సమాచారానికి సంకెళ్లు

ఇంటర్నెట్ ఆవిర్భావం వల్ల ప్రపంచానికి జరిగిన ప్రధాన ప్రయోజనం – సమాచార మార్పిడి వేగవంతం కావడం. ఇంటర్నెట్ వాడకంలోకి వచ్చి పట్టుమని పదిహేనేళ్లు కూడా కాలేదు. కానీ ఈ స్వల్పకాలంలోనే అది ప్రపంచ ప్రజల జీవన గమనాన్ని సమూలంగా మార్చివేసింది. ప్రపంచ చరిత్రలో తలెత్తిన రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాంకేతిక విప్లవాలన్నీ ఒక ఎత్తు; ఇంటర్నెట్ ద్వారా పురుడు పోసుకొన్న సమాచార విప్లవం ఒక్కటే ఒక ఎత్తు. పత్రికలు, పుస్తకాలు, టీవీలు, టెలిఫోన్లు, రేడియోలు, ఫ్యాక్స్ యంత్రాలు వంటివి సాధించలేని సమాచార మార్పిడి స్థాయిని ఇంటర్నెట్ అత్యంత స్వల్పకాలంలో అధిగమించింది. ప్రజలు కోరుకొన్న సమాచారం, అది ఏదైనా సరే క్షణాలలో అత్యంత చవకగా, వూహించలేనంత వివరంగా అందజేసే సాధనం ఇంటర్నెట్. సమాజంలోని అన్ని వర్గాల ప్రజలూ తమ సమాచార అవసరాల కోసం ఇప్పుడు పూర్తిగా ఇంటర్నెట్ మీదనే ఆధారపడుతున్నారు. అబ్దుల్ కలాం వంటి రోదసీ శాస్త్రవేత్తల నుంచి, పొలంలో పైరు సాగు చేసుకొనే సాధారణ రైతు వరకు ఇంటర్నెట్ లేకుంటే ముందుకు కదలలేని పరిస్థితి ఏర్పడిందంటే, దాని ప్రభావం మానవ జీవిత మనుగడ మీద ఎంత ప్రగాఢంగా వుందో అర్థం చేసుకోవచ్చు.

జమీన్‌రైతు

ఇంటర్నెట్‌ను ఇంత విస్తృత ప్రజా ప్రయోజన సాధనంగా మలచిన ఘనత గూగుల్, యాహూ, వికీపీడియా, ఫేస్‌బుక్, ట్విట్టర్ వంటి వెబ్‌సైట్‌లకు చెందుతుంది. ట్యునీషియా, ఈజిప్ట్ తదితర దేశాలలో క్రూర నియంతృత్వ ప్రభుత్వాల కూల్చివేతకు ఫేస్‌బుక్ ఒక ఉపకరణంగా పని చేసిందంటే, వాటి విలువ ఏమిటో అర్థం చేసుకోవచ్చు. ఫేస్‌బుక్ తర్వాత చెప్పుకోదగిన సమాచార కంచు కాగడా – వికీపీడియా. విజ్ఞాన సర్వస్వాన్ని ఒక్క మీట నొక్కితే అందుబాటులోకి వచ్చేట్లు చేసిన అద్భుత వెబ్‌సైట్ అది. పాతకాలంలో ప్రామాణికంగా వినుతికెక్కిన బ్రిటీష్ ఎన్‌సైక్లోపీడియాకు కొన్ని వేల రెట్లు అధికంగా సమాచారాన్ని ప్రజలకు చేరువ చేస్తున్నది అది. లాభాపేక్ష లేకుండా, కేవలం ప్రజలకు విజ్ఞాన ప్రపంచాన్ని చేరువ చేయాలనే ఉదాత్త ఆశయంతో నడుస్తున్న సంస్థ అది. ప్రపంచవ్యాప్తంగా కొన్ని లక్షల మంది సమాచార స్వేచ్ఛను కోరుకొనే ప్రజాస్వామిక వాదులు దానికి చిరు మొత్తాలు చందాలు ఇస్తూ వుంటారు. అందులో 'జమీన్‌రైతు' పత్రిక కూడా ఒక భాగం. ఆ సంస్థ ప్రాబవంలోకి వచ్చిన నాటి నుంచి 'జమీన్‌రైతు' పత్రిక దాని నిధుల సేకరణకు తన ఉడతా భక్తి సహాయం చేస్తున్నది.

సమాచార మార్పిడి సలీసుగా, సులభంగా, స్వతంత్రంగా, సమగ్రంగా జరగడం వల్ల కలిగే ఉపయోగాలు వర్ణించ సాధ్యం కాదు. ఆర్థికంగా, రాజకీయంగా, సామాజికంగా, శాస్త్ర పరంగా విజ్ఞానపరంగా, విద్యాపరంగా, పరిశోధనల పరంగా, ప్రజాచైతన్యం పరంగా అందువల్ల కలిగే ఉపయోగాలు లెక్కించడం అసాధ్యం. అభివృద్ధి చెందిన, చెందుతున్న, చెందని దేశాల మధ్య అంతరాన్ని తొలగించే దివ్యాస్త్రం అది. ప్రజల మధ్య వుండే అంతరాలను నిర్మూలించే వరం అది. సమాచారాన్ని నిరోధిస్తే, నియంత్రిస్తే, దాచిపెడితే సమాజానికి ఎంత నష్టం జరుగుతుందో చెప్పడానికి వీలు లేదు. చరిత్రలో అందుకు ఎన్నో ఉదాహరణలున్నాయి.

ప్రపంచ ప్రజల సమాచార స్వేచ్ఛను హరించడానికి ఇప్పటికే చైనా క్రూరమైన చట్టాలను చేసింది. ఇప్పుడు ఆ బాటలో అమెరికా కూడా పయనించబోతున్నది. ప్రజాస్వామ్యానికి పుట్టినిల్లని ఘనంగా, గర్వంగా చెప్పుకొనే అమెరికన్ పాలకులు ఇంటర్నెట్‌లో స్వేచ్ఛగా సమాచారాన్ని మార్పిడి చేసుకొనే అవకాశాన్ని హరించడానికి రెండు చట్టాలను తయారు చేశారు. స్టాప్ ఆన్‌లైన్ పైరసీ యాక్ట్, ప్రొటెక్ట్ ఐపి యాక్ట్ అనే ఈ రెండు చట్టాలు అమెరికన్ పార్లమెంట్ ఆమోదం పొందితే, ఇంటర్నెట్‌లో తాము కోరుకొన్న సమాచారాన్ని అందుకొనే హక్కును ప్రజలు కోల్పోతారు. ఇంటర్నెట్ కేంద్ర స్థానం అమెరికాయే కాబట్టి, దాని ప్రభావం ప్రపంచం మొత్తం మీద వుంటుంది. అమెరికన్ మీడియా, సినిమా, ట్రేడ్‌మార్క్ కల్గిన వ్యాపార కంపెనీలన్నీ కలిసి ఈ చట్టాలను ముందుకు తెస్తున్నాయి. వీటిని వ్యతిరేకించాలని, ఈ ప్రయత్నాలను నిరసించాలని కోరుతూ వికీపీడియా, గూగుల్ సంస్థలు ఒక నూతన సమాచార ఉద్యమాన్ని ప్రారంభించాయి. ప్రపంచ ప్రజలందరూ ఇందులో పాల్గొనాలని పిలుపు ఇస్తున్నాయి. అందుకు నాందీగా ఆ రెండు వెబ్‌సైట్‌లూ బుధవారం నుంచి తమ వెబ్‌సైట్‌లకు నల్లరంగు పులిమాయి. ప్రపంచ ప్రజల స్వేచ్ఛను కాపాడడానికి ఆ సంస్థలు చేస్తున్న ప్రజాస్వామిక ఉద్యమానికి మనమూ మన వంతు మద్దతు అందించడం అవసరం. సమాచారానికి సంకెళ్లు పడితే, మన జీవితాలూ బానిస బ్రతుకులౌతాయన్న నిజాన్ని గ్రహించి, సరైన స్పందన చూపడానికి ఇదొక అరుదైన అవకాశం.

## జనవాణి

### విద్యుత్ ఛార్జీలు పెంచవద్దు!

విద్యుత్ పంపిణీ సంస్థలు ఆదాయం లోటు 11వేల కోట్లుగా చూపించి యూనిట్‌కు సగటున 67పైసలు పెంచి పిండే ప్రయత్నాన్ని ప్రజలు హర్షించలేరు. విద్యుత్ పంపిణీ సంస్థలు మూడు విషయాలను పట్టించుకోవడం లేదు. వీటిలో మొదటిది అక్రమ మార్గాల్లో విద్యుత్ వినియోగం. రెండు విద్యుత్ బిల్లులు చెల్లించని ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలపై చర్యలు తీసుకొనకపోవడం, మూడు ఇప్పటివరకు స్థానిక సంస్థలు చెల్లించాల్సిన బిల్లులపై కారుణ్యం ప్రదర్శించడం. ఈ మూడు అంశాలు సంస్థను కష్టాల్లో నెట్టేవే. ఇవిగాక అపరాధ రుసుం, తనిఖీ ఛార్జీలు, పునరుద్ధరణ ఫీజులు 50శాతం పెంచారు. అయినా రెవెన్యూ లోటు 6వేల కోట్లుగా చూపారు. సంస్థ ముందు తనకు రావాల్సిన బకాయిలపై దృష్టి నిలిపితే బాగుంటుంది.

పి.హరిత నెల్లూరు

### హీరో నాగార్జున కొండ ఎలా ఎక్కుతాడు?

సినీ హీరో అక్కినేని నాగార్జున తల్లి అన్నపూర్ణమ్మ గత మాసంలో చనిపోయారు. ఇంట్లో ఏదైనా అశుభం జరిగాక ఏడాది పాటు తిరుమల కొండలను హిందువులు ఎక్కరు. అటువంటిది హీరో నాగార్జున తన సతీమణి అమల, కుమారుడు అఖిల్‌తో సహా ఏడుకొండలెక్కి, తలనీలాలు సమర్పించి, స్వామి దర్శనం చేసుకొచ్చారు. ఇది తప్పు. నాగార్జునను తిరుమలలో టిటిడి అధికారులు ఆపకపోవడం బాధాకరం.

దోగిపర్తి సత్యం అల్లూరు

### మంచి నిర్ణయం

73వ రాజ్యాంగ సవరణ ద్వారా 1994లో పంచాయితీరాజ్ చట్టం అమలులోకి వచ్చింది. దీని ద్వారా స్థానిక సంస్థల్లో ఐదంచెల వ్యవస్థ ప్రవేశపెట్టబడింది. ఈ వ్యవస్థలో ఎమ్పీటీసీలు, జడ్పీటీసీలు కొత్తగా వచ్చారు. ఎమ్పీటీసీలు, జడ్పీటీసీలు, మండల, జిల్లా పరిషత్తు అధ్యక్షుల ఎన్నికల్లో కీలకమయ్యే సర్పంచ్‌లు నిర్వీర్యమయ్యారు. చివరికి స్థానిక సంస్థల ఎమ్మెల్సీ ఎన్నికల్లోనూ సర్పంచ్‌లకు ఓటు హక్కు కూడా లేదు. గ్రామీణ భారతానికి అసలు సిసలు ప్రతినిధులైన సర్పంచ్‌లు బొమ్మలుగా మిగిలిపోయారు. ఇప్పటికైనా రాష్ట్ర ప్రభుత్వం మేల్కొని అసెంబ్లీలో ఎమ్పీటీసీ, జడ్పీటీసీ వ్యవస్థను రద్దు చేయాలని తీర్మానించడం శుభ సూచికం.

కె.పెంచలరెడ్డి గూడూరు

### జాలి ఫ్రెండ్స్ ఆఫ్ బిట్రగుంట!

ఐదు దశాబ్దాల క్రితం కావలిలో ఫుట్‌బాల్ పోటీలు నిర్వహించబడినప్పుడు 'జాలి ఫ్రెండ్స్ ఆఫ్ బిట్రగుంట' జట్టు తన సత్తా చాటింది. ఆ టీం తో తలపడే కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

23-1-1941
పేజీలు : 8 వెల: అణా

### నెల్లూరులో మొహరం

మద్రాసు గవర్నమెంట్ వారి సలహానుసరించి కాబోలు ఈసారికి నెల్లూరులో మొహరం పండుగలో పులివేషాలకు అధికారులు లైసెన్సులు ఇవ్వలేదు. పండుగకు మూడు రోజుల ముందు ఉత్సవం చేసుకున్న ముసల్మానులు పెట్టెలు దింపకూడదని తీర్మానించుకున్నట్లుంది. మనలో మనం సరిదిద్దుకోలేక మూడవ మధ్యస్థానికి పోతే ఏమౌతుందో చూడండి.

### వేగూరు సమ్మె – గాంధీగారు!

తిరుగా 10 మందిని 21వ తేది అరెస్ట్ చేశారు. వేగూరు సమ్మె విషయం గాంధీగారి వరకు పోయిందనీ, మిల్లు కూలీల వలెనే వ్యవసాయ కూలీలు గూడా సమ్మె చేయడానికి అధికారం ఉందని గాంధీగారు అంగీకరించారని రాఘవయ్య గారు చెబుతున్నారు.

### పొన్నలూరు రెడ్డి గారి ఔదార్యం!

గూడూరులో గొప్ప మైకా వ్యాపారము జేయు మాజీ కాంగ్రెస్ ప్రెసిడెంటు గారైన పొన్నలూరు వీరరాఘవరెడ్డి గారు తేది 20ది తన సుందరమైన నూతన గృహ ప్రవేశ సందర్భమున తన ఫ్యాక్టరీలో పనిచేయు కార్మిక స్త్రీలకు ఒక చీర, రవిక వంతున సుమారు 250 మందికి పంచిపెట్టిరి. గుమాస్తాలకు ఒక్కొక్కరికి రూ.250 వంతున వారు కోరిన వస్తువులనిప్పించిరి. ఉదయం మొదలు సాయంత్రం వరకు ఎడతెరిపి లేకుండా సుమారు 4వేల మందికి అన్నము పెట్టిరి. రెడ్డిగారు ఔదార్యంతో బీదలకు 3వేల రూపాయలు ఖర్చుపెట్టినందులకు గ్రామవాసులు కొనియాడుచున్నారు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

19-1-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### డాక్టర్ గోపాలరెడ్డి విజయ ఢంకా మ్రోగించగలరు

మద్రాసు జనరల్ హాస్పిటల్లో ఆరోగ్యాన్ని పొందుతున్న బెజవాడ గోపాలరెడ్డిగారిని 16వ తేదీ చూచి కాంగ్రెస్ అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డి పత్రికలవారితో యిలా అన్నారు. "గోపాలరెడ్డి ఎన్నికల రంగంలో ఉన్నారు. పోటీజేస్తున్నారు. కానీ వారు ప్రచారంలో తిరుగలేకపోవచ్చు. గత 35 ఏండ్లుగా వారుచేసిన సేవ ప్రజల ముందున్నది. ప్రజలు కాంగ్రెసును బలపరచగలరని నా విశ్వాసం. గోపాలరెడ్డి విజయఢంకా మ్రోగించగలరు".

రెండు మాటలలో అయినా సంజీవరెడ్డి చక్కగా చెప్పారు. కోవూరు నుంచి కొండపి వరకు ఒక్కసారి పోయి పరిశీలిస్తే సంజీవరెడ్డి గారు చెప్పినట్లు, గోపాలరెడ్డి విజయఢంకా మ్రోగించగలరనుటలో ఏమాత్రం అతిశయోక్తి కనుపించదు. ఎన్నికల్లో పోటీజేయుటకు గోపాలరెడ్డి గారు నిర్ణయించుకోవడంతో పిచ్చి పిచ్చి కలలు కంటుండిన స్వతంత్ర పార్టీ వారికి నడుం విరిగింది. గోపాలరెడ్డి అనారోగ్య కారణంగా విచిత్రమైన వదంతులు వ్యాపించాయి. వారు పోటీజేయబోవడం లేదని, ఇక తమకు అడ్డుండదని వీరు ఆశపడినారు. దీనితో కావలి వగైరా చోట్ల నక్షత్రం మార్కు జండాల ఆర్భాటం ఎక్కువైంది. ఈ పరిస్థితుల్లో గోపాలరెడ్డి గారి పోటీ ఖాయం గావడం, వారు 17వ తేది నామినేషన్ దాఖలు చేయడం స్వతంత్ర పార్టీ వర్గాలలో నిరుత్సాహము, కాంగ్రెస్ వాదులలో ఉత్సాహము కల్గించింది. గోపాలరెడ్డి గారి పోటీ అసాధారణమైనది. మామూలు పరిస్థితులలో అయితే వారు పోటీచేసి ఉండగూడదు. కానీ ఈ చివరి ఘడియలలో తాను ఉపసంహరించుకొని కాంగ్రెస్‌ను విషమ పరీక్షకు గురి చేయడం భావ్యం కాదని, ఏ పరిస్థితులలోనైనా పోటీజేసి తీరవలసిందేనని గోపాలరెడ్డి తన సుదృఢ సంకల్పాన్ని తెలియజేసి, నామినేషన్ పత్రాలు పంపారు. కాంగ్రెస్ సంస్థ పట్ల వారికున్న అచంచల భక్తి విశ్వాసాలు యెంతటి మహోన్నతమైనవో చూడండి! ఇలాంటి వున్నతాదర్శ మూర్తులు ఎందరుంటారు?

# నెల్లూరు ముచ్చట్లు

## చలిగాలులు!

గతవారం రోజులుగా చలిగాలులు నెల్లూరీయులను గజగజ వణికిస్తున్నాయి. మామూలుగా పండుగ నెలలో మంచు కురవడం పరిపాటి. థానే తుపాన్ తీరం దాటిన తరువాత రెండు మూడు రోజులు మొదట చలిగాలులు వీచాయి. ఆ తర్వాత మళ్లీ వర్షం పడినప్పటి నుంచి చలిగాలులు ఎక్కువయ్యాయి. రాష్ట్రవ్యాపితంగా కనిష్ట ఉష్ణోగ్రతల్లో నెల్లూరులోనే పరిస్థితి మెరుగ్గా ఉన్నా, రాత్రి ఉష్ణోగ్రత 19.0 డిగ్రీల సెల్సియస్‌గా నమోదవుతున్నా చలికి జనం వణికి పోతున్నారు. ఆదిలాబాద్, అనంతపురంలా చలి తీవ్రత ఏడు, పది డిగ్రీల సెల్సియస్‌కు పడిపోతే నెల్లూరీయులు ఇళ్ల నుంచి బయటకురాలేరేమో!

## హైకోర్టు జడ్జిగా నెల్లూరీయుడు!

హైకోర్టు జడ్జిగా నెల్లూరీయుడు కాళ్లకూరి గిరిజాశంకర్ నియమితులయ్యారు. జిల్లా జడ్జిగా అందరికీ సుపరిచితుడైన కె.పి.నారాయణరావు కుమారుడీయన. గతంలో గిరిజాశంకర్ రాజమండ్రి, కడపలో జిల్లా జడ్జిగా, హైదరాబాద్ సిటీ సివిల్ జడ్జి కోర్టులో జడ్జిగా పనిచేసిన అనుభవముంది. 2010 నవంబర్ నుంచి ఆయన హైకోర్టులో అదనపు న్యాయమూర్తిగా పనిచేస్తున్నారు. రాష్ట్రపతి ప్రతిభాపాటిల్ గిరిజాశంకర్‌ను హైకోర్టు జడ్జిగా నియమిస్తూ ఉత్తర్వులు జారీచేశారు. పలువురు నెల్లూరీయులు హైకోర్టు జడ్జీలుగా మంచి పేరు గడించారు. గిరిజాశంకర్ కూడా అదే బాట నడుస్తారని ఆకాంక్షిస్తున్నాం.

## జంట ఎమ్మెల్యేల గోలీలాట!

గత మూడేళ్లుగా పెద్దపండుగను పురస్కరించుకొని నెల్లూరు స్వర్ణాల చెరువు వద్ద సిటీ ఎమ్మెల్యే, రూరల్ ఎమ్మెల్యే పాత రోజుల్లో ఆటలంటూ బొంగరాలు, గోలీలాట, బిళ్లంకోడు ఆడి కాసేపు గాలిపటాలు ఎగురవేశారు. 13వ తేది తన జంట ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డితో కలిసి ఈ ఆటలాడారాయన. వివేకాతో కలిసి ఈ ఆటలాడను చెరువు దగ్గర శ్రీధర్‌కృష్ణారెడ్డి గంటకు పైగా వేచిచూడాల్సి రావడం ఈ యేడాది విశేషం.

## జగన్నాధ రథయాత్ర

నెల్లూరులోని ఇస్కాన్ సంస్థ అత్యంత ప్రాచీనమైన జగన్నాథ రథ యాత్రను 21వ తేది నెల్లూరులో నిర్వహిస్తుంది. ఈ యాత్ర నిర్వహించడం నెల్లూరులో ఇదే మొదటిసారి. ఏసి సెంటర్ నుంచి టిటిడి కళ్యాణ మండపం వరకు జరిగే ఈ యాత్రలో విదేశీ భక్తులు 50 మంది, రాష్ట్రవ్యాప్తంగా ఉన్న 10వేల మంది శ్రీకృష్ణుని భక్తులు హాజరవుతారని ఇస్కాన్ నిర్వాహకుడు డాక్టర్ సుఖదేవ్‌స్వామి చెప్పారు.

## స్పీకర్‌ను నెల్లూరుకు పిలిచిన ముంగమూరు!

శాసనసభకు కొత్తగా ఎన్నికైన శాసనసభ్యులను అసెంబ్లీ స్పీకర్ నాదెండ్ల మనోహర్ ఇటీవల అరకు యాత్రకు తీసుకెళ్లిన విషయం విదితమే. అక్కడ మన్య ప్రజల జీవితాలు శాసనసభ్యులకు అర్థమయ్యేలా చేశారాయన. ఈ యాత్రకు నెల్లూరు నుంచి నెల్లూరు సిటీ శాసనసభ్యుడు ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు హాజరయ్యారు. పనిలో పనిగా మత్స్యకారుల సమస్యలు తెలుసుకోను నెల్లూరు జిల్లాకు స్పీకర్ నాదెండ్ల మనోహర్‌ను ఆహ్వానించినట్లు శ్రీధర్ కృష్ణారెడ్డి చెప్పారు. శాసనసభ్యులందరూ శ్రీహరికోట షార్ సెంటర్‌ను చూసేలా ఒక యాత్రను ఏర్పాటు చేయమని కూడా స్పీకర్‌కు సూచించారాయన.

## జగన్‌కు చెంపపెట్టు!

మాజీ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఆస్తులపై సిబిఐ దర్యాప్తు జరిపించాలంటూ రాష్ట్ర హైకోర్టులో దాఖలు చేసిన పిటిషన్ విచారణను మరో రాష్ట్ర హైకోర్టుకు బదిలీచేయాలంటూ వైఎస్ విజయమ్మ దాఖలు చేసిన పిటిషన్‌పై సుప్రీంకోర్టు న్యాయమూర్తి చేసిన వ్యాఖ్యలు వైఎస్ జగన్మోహన్‌రెడ్డి, విజయమ్మలకు చెంపపెట్టని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి వ్యాఖ్యానించారు. 16వ తేది నెల్లూరులో విలేకరులతో మాట్లాడుతూ స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచి న్యాయ వ్యవస్థను జగన్మోహన్‌రెడ్డిలా కించపరచిన వ్యక్తిలేడని దీనికిగాను ఆయన క్షమాపణ చెప్పాలన్నారు. ఇకనైనా ఆయన బుద్ధి తెచ్చుకొని మసలాలన్నారు. ఎమ్మార్ కుంభకోణం, జగన్ అవినీతి అక్రమాలకు సంబంధించిన వివరాలు కెవిపి రామచంద్రరావు దగ్గర మాత్రమే దొరుకుతాయని చమత్కరించారు.

## ఇదేం చేరిక!

ఇక్కడా అక్కడా అనే తేడా లేకుండా అన్ని చోట్లా విలేకరుల సమావేశాలు ఏర్పాటు చేయడం రూరల్ శాసన సభ్యుడి నైజం. దీనికిగాను విలేకరులు నొచ్చుకొన్నా ఏదో ఒక సబ్జెక్ట్ మాట్లాడుతాడని ఆయన బీట్ కేటాయించిన విలేకరులు వెళ్తూనే ఉంటారు. బోడిగాడి తోటలోని సమాధుల వద్ద పెద్ద పండుగను పురస్కరించుకొని చేయాల్సిన ఏర్పాట్లు చూసేందుకు వచ్చిన వివేకా ఈ ప్రాంత చోటా నేత అల్లావుద్దీన్‌ను ఆయన అనుచరులతో సహ పార్టీలో చేర్చుకొన్నారు. పార్టీలో చేరను బోడిగాడి తోటను వేదికగా ఎంచుకొన్న అల్లావుద్దీన్ విచిత్ర పోకడ, ఆయన్ను చేర్చుకొన్న వివేకా వ్యవహారశైలి మరోసారి చర్చనీయాంశమయ్యింది.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

జీవిత చందా రూ.1000/-

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-

విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**

పొగతోట, నెల్లూరు - 524 001

ఫోన్: 0861 - 2327354

సెల్: 98489 66190

## మూర పూలు @ 50

డబ్బుకు లోకం దాసోహం పాత పాట. డబ్బుకు విలువ లేకపోవడం నేటి మాట. పండుగలను పురస్కరించుకొని పూల రేట్లు విపరీతంగా పెరిగిపోయాయి. నెల్లూరు ఆత్మకూరు బస్టాండ్ వద్ద గల హోల్‌సేల్ పూల మార్కెట్‌లో కిలో కనకాంబరాలు 800 రూపాయలు. 40 రూపాయలకు దొరికే కాగడాలు 400 రూపాయలు పలికాయి. మూర కనకాంబరాలను పండుగ మూడు రోజులూ నిలబెట్టి 50 రూపాయలకు అమ్మారు. ఈ రేటు ఇప్పటివరకు ఆల్ టైం రికార్డు.

## అయ్యప్ప జ్యోతిదర్శనం!

మకర సంక్రాంతిని పురస్కరించుకొని నెల్లూరు అయ్యప్ప స్వామి దేవస్థానంలో మకర విళక్కు కర్పూర జ్యోతి దర్శనం 15వ తేది జరిగింది. పెద్ద సంఖ్యలో అయ్యప్ప దీక్షదారులు, స్వామి భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. దేవస్థానం పాలకవర్గం చైర్మన్ పిటి రంగరాజన్ ఈ వేడుక ఘనంగా జరగడానికి కావాల్సిన ఏర్పాట్లన్నీ చేశారు.

## నెల్లూరులో గాలి

తెలుగుదేశం పార్టీ సీనియర్ శాసనసభ్యుడు గాలి ముద్దుకృష్ణమనాయుడు 13వ తేది నెల్లూరు వచ్చారు. పార్టీ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. కోవూరు ఉప ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ ఘన విజయం సాధిస్తుందన్నారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ రెండవ స్థానంలో, కాంగ్రెస్ పార్టీ మూడవ స్థానంలో నిలుస్తుందని జోస్యం చెప్పారు. 1983 నుంచి నల్లపురెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డిని తెలుగుదేశం నాలుగుసార్లు శాసనసభ్యుడిని, ఒకసారి మంత్రిగా చేసినా ఆయన పార్టీకి వెన్నుపోటు పొడవడం దారుణమన్నారు. ఓటర్లు ప్రసన్న వైఖరి పట్ల అప్రమత్తంగా ఉండాలన్నారు. మాజీ మంత్రి తాళ్లపాక రమేష్ రెడ్డి కూడా ఈ విలేకరుల సమావేశంలో పాల్గొన్నారు.

## కావలికి కొత్త ఆర్డీఓ

చిత్తూరు ఆర్డీఓగా పనిచేస్తుండిన సుబ్రమణ్యేశ్వరరెడ్డిని కావలి ఆర్డీఓగా ప్రభుత్వం బదలీ చేసింది. ఇక్కడ పనిచేస్తుండిన వెంకటేశ్వర్లును కందుకూరుకు మార్చారు. కొత్త ఆర్డీఓ సుబ్రమణేశ్వర రెడ్డి కడప జిల్లా రాజంపేటవాసి. కడప ఆర్డీఓగా ఆయన మంచి పేరు తెచ్చుకొన్నారు.

## గాయత్రీనగర్‌లో చోరీ

నెల్లూరు నగరంలో ఇంటి దొంగతనాలు ఆగడం లేదు. వేదాయపాళెం గాయత్రీనగర్‌లో కాపురముంటున్న విశ్రాంత ప్రభుత్వ ఉద్యోగి ఈదూరు మోహన్ పండుగను పురస్కరించుకొని స్వగ్రామం వెళ్లి 16వ తేది వచ్చి చూడగా ఇంట్లోని 51 సవర్ల బంగారు చోరీ అయ్యింది. దీనిలో 28 గ్రాముల డైమండ్ నెక్లెస్ కూడా ఉంది. నేర స్థలాన్ని సిసిఎస్ పోలీసులు సందర్శించారు. పాత నేరస్తులే ఈ దొంగతనం చేసి ఉంటారని ప్రకటించి వచ్చారు. దొంగతనాలు అరికట్టే విషయమై పోలీసులు గట్టి చర్యలు తీసుకోకపోవడం వల్ల నగరంలో దొంగతనాలు ఆగడం లేదు.

## గ్యాస్ సిలిండర్ పేలింది

నెల్లూరు ఇరుగాళమ్మ దేవస్థానం సమీపంలో రేకుల ఇంట్లో నివసించే గోవింద్ ఇంటిలో 16వ తేది పండుగ పూట గ్యాస్ సిలిండర్ పేలడంతో రేకులు ఎగిరిపోయి ఇల్లు చిందరవందర అయ్యింది. గ్యాస్ సిలిండర్లలో లోపమో వినియోగించే వాళ్లు చేస్తున్న పొరపాట్లో తెలియదుగాని జిల్లాలో సిలిండర్లు పేలిపోవడం ఎక్కువయ్యింది.

## ఆయనా విమర్శించేది?

చెట్టు పేరు చెప్పుకొని కాయలు అమ్ముకొనే చరిత్ర ఆనం కుటుంబీకులదే తప్ప నందమూరి బాలకృష్ణది కాదని కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి విమర్శించారు. 13వ తేది ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ వివేకానందరెడ్డి నటుడు బాలకృష్ణ, చిరంజీవితో పోటీపడలేడంటున్నాడు. కాంగ్రెస్‌కు 120 ఏళ్ల చరిత్ర ఉందని గొప్పలు చెప్పే కాంగ్రెస్ నాయకులు ప్రజారాజ్యం పార్టీ పెట్టి అట్టర్‌ప్లాప్ అయిన నటుడు చిరంజీవిని భుజాల కెత్తుకొని మోసే హీనస్థితికి దిగజారారన్నారు. ఎన్టీరామారావు బతికున్నప్పటి నుంచి నటుడు బాలకృష్ణ తెలుగుదేశం పార్టీ తరపున ప్రచారం చేస్తున్నారని; ఆయన పార్టీ తరపున రాబోయే ఎన్నికల్లో పోటీచేస్తే ప్రభంజనం సృష్టించడం ఖాయమన్నారు.

## తిరుప్పావై పరిసమాప్తి

ధనుర్మాసం సందర్భంగా నెల్లూరు ఉస్మాన్‌సాహెబ్‌పేట కోదండరామస్వామి ఆలయ ప్రాంగణంలో నెల రోజులుగా జరిగిన తిరుప్పావై ప్రవచనం 14వ తేది

కొరవ 14వ పేజీలో

● ట్రంకురోడ్డుపై

# సిమెంటు రోడ్డేమిటి?

**ఏమిటీ అతుకుల పని? ఎవరి కోసం... ఎందుకోసం??**



బొల్లినేని హాస్పిటల్ వద్ద నిర్మాణంలో ఉన్న సిమెంటు రోడ్డు.

నెల్లూరులో అభివృద్ధి పనుల పేరిట ప్రజాధనాన్ని దుర్వినియోగ పర్చడంలో నేతలకు అధికారులు మంచి సహకారమందిస్తున్నారు. నగరంలో అయ్యప్పగుడి సెంటర్ నుంచి ఆత్మకూరు బస్టాండ్ వరకు ట్రంకురోడ్డుగా పిలువబడే రోడ్డును ఇప్పటికే కోట్లాది రూపాయలు వెచ్చించి తారురోడ్డుగా వేసి వున్నారు. దేడ్‌మార్ పనుల వల్ల ఈ రోడ్డు తరచూ దెబ్బతినిపోతూ వుంది. పనులు పటిష్టంగా చేయడంలో విఫలమవుతున్న అధికారులు ఈ రోడ్డు విస్తరణ పేరిట అక్కడక్కడ సిమెంటు రోడ్డుగా వేయడమేమిటో అర్థమే కావడం లేదు. ఈ రోడ్డును మొదట గాంధీబొమ్మ సెంటర్‌లో సిమెంటు రోడ్డుగా వేశారు. దీనివల్ల కల్గిన ప్రయోజనమేమీ లేదు. మొన్నటి వర్షాలకు మోకాలులోతు నీళ్లు నిలిచిపోయాయి. ఆరు నెలలోనే ఈ రోడ్డుపై గుంటలు కూడా పడ్డాయి. ఈ ప్రయోగం విఫలమైనా నగరంలోని బొల్లినేని హాస్పిటల్ నుంచి శబరి శ్రీరామక్షేత్రం వరకు సిమెంట్ రోడ్డును మళ్లీ వేయడం మొదలు పెట్టారు. ఈ పనులు నత్తనడకన జరుగుతుండడం వల్ల ఈ మార్గాన వెళ్లే ప్రయాణీకులు పడరాని పాట్లు పడుతున్నారు. కొంతమేర ట్రాఫిక్‌ను పొదలకూరు రోడ్డులోనికి మళ్లించినా ప్రయోజనం పెద్దగా లేదు. ఆక్రమణల తొలగింపు, డ్రైనేజి నిర్మాణం చేపట్టకుండా సిమెంటు రోడ్డు వేయడం వ్యర్థం. ప్రస్తుతం సిమెంటురోడ్డు వేస్తున్న ప్రాంతంలో ఇప్పటికే వున్న భవనాలు, హోటళ్లు, హాస్పిటళ్ల వల్ల వర్షపు నీళ్లు పోయేదారి కానరావడం లేదు. ప్రణాళిక పాడు లేకుండా కేవలం తమ అనుచరులకు కాంట్రాక్టు పనులు కట్టబెట్టడం కోసం రోడ్లను ఇష్టమొచ్చినట్లు వేయడం నాగరికులు చేసే పని కాదు. ఎలాగూ సిమెంటు రోడ్డు పనులు మొదలు పెట్టారు కాబట్టి వీటినైనా పద్ధతిగా చేపట్టేలా ఉన్నతాధికారులు తగిన చర్యలు తీసుకోవాల్సి వుంది.



వెంకటాచలంలోని స్వర్ణభారత్‌లో జరిగిన సంక్రాంతి సంబరాల్లో పాల్గొన్న కర్నాటక ముఖ్యమంత్రి సదానందగౌడకు పుష్పగుచ్ఛమందిస్తున్న కర్నాటక తెలుగు జర్నలిస్టుల అసోసియేషన్ గౌరవాధ్యక్షుడు, నెల్లూరీయుడు రావిమోహన్‌చౌదరి. చిత్రంలో వెంకయ్యనాయుడు కూడా ఉన్నారు.



నగరంలో భోగి పండుగను పురస్కరించుకొని మంటవేస్తున్న యువకులు.

# అంతంతమాత్రంగానే పెద్ద పండుగ!

మారిన ఋతు చక్రం, పెరిగిన ధరలు, సంస్కృతీ విఘాతం మూలంగా ఈసారి పెద్ద పండుగను నెల్లూరీయులు అంతంత మాత్రంగానే జరుపుకొన్నారనాలి. జనవరి 1తేది వేడుకకంటే ఘనంగా కూడా సంక్రాంతి జరుపుకోలేదని తేల్చి చేప్పేయవచ్చు. పండుగంటే చేసే పిండి వంటకాలకు కావాల్సిన వస్తువుల ధరలన్నీ పెరిగిపోవడంతో మధ్యతరగతీయులు పండుగను ఘనంగా చేసుకోలేక పోయారు. భోగి పండుగకు శనివారం, కనుమ పండుగకు సోమవారం విఘాతం కావడంతో కేవలం 30–40 శాతం మందే మాంసాహారాన్ని వండుకోగలిగారు. శాకాహారంలోనికి అవసరమైన కూరలు బాగా చేసుకోను ఈసారి టమోటా మినహా మరే కూరగాయల ధరలు అందుబాటులో లేవు. 60 రూపాయలు పెట్టినా పండగపూట వంకాయలు దొరకలేదు. బెండకాయలు, బీన్స్, క్యారెట్, బీరకాయలు కూడా తగినంతగా మార్కెట్‌కు రాలేదు. ఆకుకూరలకు తెగ డిమాండ్ ఏర్పడింది. చికెన్ స్కిన్‌లెస్ కిలో 120 రూపాయలకే అందుబాటులో వున్నా పెద్ద వ్యాపారం లేదు. మటన్, ఫిష్ మార్కెట్లలోనూ జనం పలుచగా కనపడ్డారు. సంక్రాంతి రోజు బోడిగాడితోటలోని పెద్దల సమాధులను చాలా మంది సందర్శించారు. 15, 16 తేదీల్లో నగరంలోని రోడ్లు జనసంచారం లేక నిర్మానుష్యంగా కనిపించాయి. 16తేదీ కనుమ సందడి కొంత బ్రాందీ షాపుల దగ్గర కనిపించింది. పంట చేతికి రాకపోవడం మనీ సర్క్యులేషన్ స్కీంలో కోట్లాదిరూపాయలు పోగొట్టుకోవడంతో గ్రామీణ ప్రాంతాల్లో కూడ పండుగ కళ తక్కువేననాలి.

# నెల్లూరీయులకు అవార్డు!



విశాఖపట్నంలోని ఎపి స్టేట్ కల్చరల్ అవేర్‌నెస్ సొసైటీ ప్రకటించిన బెస్ట్ సిటిజన్ అవార్డు ఒడిస్సా ముఖ్యమంత్రి గిరిధర్ గోమాంగో చేతులమీదుగా అందుకొంటున్న గుండాల నరేంద్రబాబు.

విశాఖపట్నంలోని ఆంధ్రప్రదేశ్ స్టేట్ కల్చరల్ అవేర్‌నెస్ సొసైటీ 11వతేది ఇక్కడి కళాభారతి ఆడిటోరియంలో వివిధ రంగాల్లో విశేష ప్రతిభ కనబరచిన వారికి స్టేట్ బెస్ట్‌సిటిజన్ అవార్డులు అందజేసింది. ఈ అవార్డులను పలువురు నెల్లూరీయులందుకున్నారు. వీరిలో ఉపాధ్యాయులుగా పనిచేస్తున్న గుండాల నరేంద్రబాబు, ఓజిలి నారాయణ, మలిశెట్టి శివకుమార్, డాక్టర్ వి.శైలజ వున్నారు. శాస్త్రీయ నృత్యంతో మంచి ప్రతిభ కనపర్చిన గోగులపల్లి సునేత్ర, తిరుమలశెట్టి శ్రావ్యలకు బెస్ట్ చైల్డ్ అవార్డులను ఒడిశా మాజీ ముఖ్యమంత్రి గిరిధర్ గోమాంగో, మాజీ ఎమ్పీ భాట్టం శ్రీరామమూర్తి అందించారు. అవార్డుపొందిన నెల్లూరీయులను పెన్నా రచయితల సంఘం వ్యవస్థాపక అధ్యక్షుడు మోపూరు పెంచల నరసింహం అభినందించారు.

● కొండాయపాలెం

# హాస్టల్‌లో రౌడీయిజం!

**పస్తులుంటున్న విద్యార్థులు**




ఈ హాస్టల్‌లో నిత్యం రగడలే.

జిల్లాలో సాంఘిక సంక్షేమశాఖ ఆధ్వర్యంలో నడుస్తున్న హాస్టళ్లలో చదువుకొనే విద్యార్థుల పరిస్థితి రోజురోజుకు అధ్వాన్నంగా తయారవుతుంది. హాస్టల్ సిబ్బంది చేతివాటం ఒకవైపు, బయట వ్యక్తుల ప్రవేశం, దౌర్జన్యకర పోకడలతో మరొకవైపు విద్యార్థులు పస్తులుండాల్సి వస్తోంది. కొండాయపాళెంగేటు వద్ద వుండే కళాశాల హాస్టల్‌లో బయటి వ్యక్తుల సంచారం అధికంగా వుంటోంది. వివిధ ప్రాంతాల నుంచి చదువుకొనేందుకు వచ్చే విద్యార్థులు ఈ హాస్టల్‌లో వుంటున్నారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారం హాస్టల్ విద్యార్థులకు ఆహారాన్ని అందించాల్సి వుంటుంది. అసలే వార్డెన్, వంట మనుషులు చేతివాటం ప్రదర్శించి సగం దిగమింగేస్తుండగా, పూర్వ విద్యార్థుల పేరుతో, వివిధ కుల సంఘాలలో పని చేసే నెపంతో ఆ సమయానికి హాస్టల్‌కు వచ్చి విద్యార్థులకు వండి వుంచిన ఆహారాన్ని తినేస్తుండడం, దీనిపై ప్రశ్నిస్తే హాస్టల్ సిబ్బందితోపాటు, విద్యార్థులను కొట్టి, బెదరించి గొడవకు దిగుతుండడంతో నిత్యం సమస్యలు ఎదురౌతున్నాయి. చదువుకొందామని ఇక్కడ వుండే హాస్టల్ విద్యార్థులు రౌడీమూకలు, అల్లరి మూకల రాకతో కడుపు మాడ్చుకొని పస్తులుండాల్సి వస్తోంది. దీనిపై పలుమార్లు సాంఘిక సంక్షేమ అధికారులకు విన్నవించుకొన్నా ఫలితం లేకుండా పోతోందని విద్యార్థులు వాపోతున్నారు. మరోవైపు హాస్టల్ వార్డెన్లు సైతం ఇక్కడ పని చేయాలంటే హడలిపోతున్నారంటే ఎంతగా హాస్టల్‌లో బయటివ్యక్తులు తిరుగుతున్నారో, దౌర్జన్యంగా వ్యవహరిస్తున్నారో అర్థమవుతుంది. ఇప్పటికైనా జిల్లా ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని హాస్టల్ పరిస్థితుల్ని చక్కదిద్ది చక్కటి వాతావరణాన్ని కల్పించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

# ఉపాధిహామీలో పెరిగిన పనిదినాలు

జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం ద్వారా ఇక నుంచి రెండు వందల పనిదినాలు కల్పించనున్నారు. ఇప్పటివరకు సంవత్సరంలో వంద పని దినాలు మాత్రమే కల్పిస్తూ వచ్చారు. అధికారులు, కేంద్రప్రభుత్వం వలస కూలీలను దృష్టిలో వుంచుకొని సంవత్సరంలో రెండు వందల పని దినాలు కల్పించాలని నిర్ణయించింది. కేంద్రం నుంచి అనుమతి లభించడంతో గ్రామీణాభివృద్ధిశాఖ ఈ మేరకు జారీ చేసిన ఉత్తర్వులు జిల్లా కేంద్రానికి చేరాయి. జాబ్

## మారిన మార్గదర్శకాలు

కార్డులు సైతం రెండు వందల పని దినాలకు వీలుగా వుండే విధంగా జారీ చేస్తారు. గతంలో కంటే అదనంగా పని దినాలు పెంచడంతోపాటు వారానికి రెండు దఫాలు కూలీలకు నగదు చెల్లింపులు జరపాలని ప్రభుత్వం ఆదేశించింది. కూలీలకు ఎటువంటి ఇబ్బంది తలెత్తకుండా క్షేత్ర సహాయకులు అవసరమైన ఏర్పాట్లు చేయాల్సి వుంటుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఇటీవల జారీ చేసిన నూతన మార్గదర్శకాలను పటిష్టంగా అమలు జరిపితే అవినీతి, అక్రమాలు జరిగేందుకు అవకాశం వుండదు.

## ● ఎస్సీ, ఎస్టీల కోసం

# ప్రత్యేక ప్రజావిజ్ఞప్తుల దినం!

**● జిల్లాలోని షెడ్యూల్డ్ కులాలు, తెగలకు చెందిన ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి జిల్లా కలెక్టర్ ప్రత్యేక విజ్ఞప్తుల దినానికి శ్రీకారం చుట్టారు. తొలుత కావలిలో చేపట్టిన ఈ కార్యక్రమాన్ని 11వ తేది నెల్లూరులో ఏర్పాటు చేశారు.**



సమావేశంలో మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి. ప్రక్కన నెల్లూరు ఆర్డీఓ మాధవీలత.

జిల్లాలోని షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డు తెగలకు చెందినవారి సమస్యల పరిష్కారం కోసం ప్రత్యేక ప్రజావిజ్ఞప్తుల కార్యక్రమానికి జిల్లా కలెక్టర్ శ్రీకారం చుట్టారు. తొలుత కావలి డివిజన్‌లో నిర్వహించారు. రెండవ విడత నెల్లూరు డివిజన్ కేంద్రమైన నగరంలోని ఆర్డీఓ కార్యాలయంలో ఈ నెల 11వ తేది ఏర్పాటు చేయడం జరిగింది. నెల్లూరు డివిజన్ పరిధిలో ఉన్న మండలాలకు చెందిన ఎస్సీ, ఎస్టీలు తమ సమస్యలు విన్నవించుకునేందుకు భారీ సంఖ్యలో తరలివచ్చారు. నెల్లూరు రూరల్, ఇందుకూరుపేట, తోటపల్లి గూడూరు, ముత్తుకూరు, వెంకటాచలం, ఆత్మకూరు, రాపూరు, చేజర్ల, పొదలకూరు, ఎఎస్‌పేట, అనంతసాగరం తదితర మండలాలు ఈ డివిజన్ పరిధిలో ఉన్నాయి. ఎస్సీ, ఎస్టీల కోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన ఈ కార్యక్రమానికి పై మండలాలకు చెందిన తహశీల్దార్లు హాజరయ్యారు.

### కలెక్టర్ కృషి

జిల్లా కలెక్టర్ ప్రత్యేక చొరవ తీసుకుని దళితుల సమస్యల పరిష్కారం కోసం కృషి చేస్తున్నప్పటికీ క్రిందిస్థాయి అధికారులు సరైన సహకారం అందించడం లేదు. దీంతో సమస్యలు పరిష్కారానికి నోచుకోలేక పోవడమే కాకుండా పేరుకుపోతున్నాయి. ప్రధానంగా ఎస్సీ, ఎస్టీలపై దాడులు, మహిళలపై అత్యాచారాలు జరగడం, కులం పేరుతో దూషించడం, గ్రామ బహిష్కరణకు గురి చేయడం వంటి సంఘటనలు జరుగుతున్నాయి. పై సంఘటనలపై స్పందించి నిందితులను అరెస్ట్‌చేసి, బాధితులకు రక్షణ కల్పించాల్సిన పోలీసు, రెవిన్యూ యంత్రాంగం సక్రమంగా పనిచేయడం లేదన్న ఆరోపణలున్నాయి. బాధితులు పోలీస్‌స్టేషన్‌కు వెళ్లి ఫిర్యాదు చేసినా రాజకీయ ఒత్తిళ్ల కారణంగా పట్టించుకోని పరిస్థితి ఉంది.

### పెండింగ్‌లో కేసులు

జిల్లావ్యాప్తంగా ఎస్సీ, ఎస్టీలకు సంబంధించిన వివిధ రకాల కేసులు ఆయా డిఎస్పీల వద్ద పెండింగ్‌లో ఉన్నాయి. సంఘటన జరిగిన వెంటనే ఫిర్యాదు స్వీకరించిన పోలీసులు విచారణ చేస్తే వాస్తవాలు తెలుసుకునే అవకాశముంటుంది. కాలయాపన చేయడం వల్ల రాజకీయ ఒత్తిళ్లు పెరిగి బాధితులను రాజీకి ఒప్పిస్తున్నారు. జిల్లాలో ఈ మధ్యకాలంలో నెల్లూరు రూరల్ మండలం వెల్లంటి గ్రామంలోనూ, బాలాయపల్లి మండలంలోని మరో గ్రామంలో దళితులు గ్రామ బహిష్కరణకు గురికాబడ్డారు. పత్రికల్లో కథనాలొచ్చిన తర్వాత అధికార యంత్రాంగం స్పందించి ఆ గ్రామాలకెళ్లాయి. ప్రతి గ్రామ పంచాయితీలో గ్రామ రెవిన్యూ అధికారి, పంచాయితీ కార్యదర్శి నియమితులై ఉన్నారు. గ్రామంలో ఏ సంఘటన జరిగినా వెంటనే సంబంధిత శాఖాధికారులకు వారు సమాచారమందించాల్సిన బాధ్యతుంటుంది. అయితే ఎస్సీ, ఎస్టీలు గ్రామ బహిష్కరణకు గురైన విషయం అధికారులకందించలేకపోయారు.

### నిర్లక్ష్యంగా వ్యవహరించిన వారిపై చర్యలు లేవు!

విధి నిర్వహణ పట్ల నిర్లక్ష్యంగా వ్యవహరించిన వారిపై చర్యలు తీసుకోక పోవడం విశేషం. ఇటువంటి సంఘటనలు జిల్లాలో పునరావృతం కాకూడదన్న ఉద్దేశ్యంతో జిల్లా కలెక్టర్ ప్రత్యేక చర్యలు చేపట్టారు. ఎస్సీ, ఎస్టీలపై జరుగుతున్న దాడులపై కఠిన చర్యలు తీసుకోవడంతోపాటు బాధితులకు న్యాయం చేయాలన్నది కలెక్టర్ సంకల్పం. ఈ కేసులకు సంబంధించి కేసు నమోదు దగ్గర నుంచి విచారణ జరిపి నిందితులను అరెస్ట్ చేసే బాధ్యత పోలీసు శాఖపై ఉంటుంది. పోలీసులు కఠినంగా వ్యవహరిస్తే దాడులను పూర్తిగా నియంత్రించే అవకాశముంది. జిల్లాలోని మూడు డివిజన్ కేంద్రాల్లో ప్రత్యేక కార్యక్రమం ఏర్పాటుచేసి వినతి పత్రాలు స్వీకరించారు. భూ సమస్యలతోపాటు ఇతర సమస్యలపై వినతి పత్రాలు సమర్పించారు. మండల తహశీల్దార్లు ఫిర్యాదులపై చర్యలు తీసుకోకపోతే వారిని ఉపేక్షించేదిలేదని కలెక్టర్ హెచ్చరికలు చేశారు.

### పెద్ద సంఖ్యలో హాజరైన బాధితులు

ఇప్పటికే పలు దఫాలు హెచ్చరికలు చేసినా పట్టించుకోని వారు అనేక మంది ఉన్నారు. మరో దఫా ఫిర్యాదు అందితే సస్పెండ్ చేయడం ఖాయమన్న అభిప్రాయం అందరి నోట వినిపిస్తుంది. నెల్లూరు ఆర్డీఓ కార్యాలయంలో నిర్వహించిన ఈ కార్యక్రమానికి మహిళలు కూడా వర్షాన్ని సైతం లెక్క చేయకుండా తరలి వచ్చారు. జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్ రెడ్డి, జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్, ఆర్డీఓ మాధవీలత డివిజన్ పరిధిలోని అన్ని మండలాల తహశీల్దార్‌లు పాల్గొన్నారు.




ది నెల్లూరు ఆర్యవైశ్య బులియన్ మర్చంట్స్ అండ్ పాన్‌బ్రోకర్స్ అసోసియేషన్ నేతృత్వంలో మెరిట్ విద్యార్థి సిహెచ్.క్రిష్ణ చైతన్యకు లాప్‌టాప్ బహుకరిస్తున్న సంస్థ అధ్యక్షుడు అమరా మోహన్‌రావు, ప్రధానకార్యదర్శి తులసి సుధాకర్‌రావు.




నెల్లూరు టౌన్‌హాల్‌లో జరిగిన ఉచిత బలిజ, కాపు, తెలగ వివాహ పరిచయ వేదికకు ముఖ్యఅతిథులుగా విచ్చేసిన ఎపిస్పీ నాగేశ్వరరావు, అదనపు జెసి లక్ష్మీకాంతంను సన్మానిస్తున్న విశ్రాంత డిపిఆర్వో వెంకటరత్నం.

# బోగోలు ఎంఇఓపై ఫిర్యాదు!

## గాడి తప్పిన విద్యా వ్యవస్థ



ఎంఇఓ మీద ఎండిఓకు ఫిర్యాదు చేస్తున్న బోగోలు ఉపాధ్యాయులు.

మండల విద్యాశాఖ అధికారి సక్రమంగా విధి నిర్వహణ చేయకపోతుండడంతో విసిగివేసారిన ఉపాధ్యాయులు ఏకంగా ఆ అధికారిపైనే ఫిర్యాదు చేసిన వ్యవహారం బోగోలు మండలంలో చోటు చేసుకుంది. రెగ్యులర్ ఎంఇఓ పదవీ విరమణ చేయడంతో జడ్పీహైస్కూలు హెడ్‌మాస్టర్‌గా వున్న అచ్చిరెడ్డి ఎంఇఓగా బాధ్యతలు చేపట్టారు. ఆయన వచ్చిన నాటి నుంచి మండలంలో విద్యాశాఖ గాడి తప్పిందని స్వయంగా ఉపాధ్యాయులే విమర్శిస్తున్నారు. పలు పాఠశాలల్లో మధ్యాహ్న భోజనం సరిగా అందక విద్యార్థులు ఇబ్బందులు పడుతున్నా పట్టించుకోవడం లేదట. దీనిపై పలుమార్లు ఆయన దృష్టికి ఈ సమస్యను తీసుకెళ్లినా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. విద్యావాలంటీర్ల నియామకాల్లోను నియమనిబంధనలకు విరుద్ధంగా వ్యవహరిస్తుండడం ఇతరత్రా ఉపాధ్యాయుల సమస్యలపై స్పందించక పోవడంతో మండలంలోని ఉపాధ్యాయులందరూ ఎంపిడిఓ కనకదుర్గభవానిని కలసి వినతి పత్రం అందజేశారు. అంతేకాకుండా కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు దృష్టికి ఎంఇఓ వ్యవహార శైలిని తీసుకెళ్లారు. ఇలాగే కొనసాగితే మండల విద్యాశాఖాధికారికి వ్యతిరేకంగా ధర్నా చేపడుతామని హెచ్చరిస్తున్నారు ఉపాధ్యాయులు.

# చాముండేశ్వరి చుట్టూ తిరుగుతున్న నాయకులు!

ఇందుకూరుపేట మండలం గంగపట్నం గ్రామంలో వెలసి వుండే చాముండేశ్వరిదేవి ఆలయానికి జిల్లాలోని వివిధ ప్రాంతాల నుంచి భక్తులు వస్తుంటారు. భక్తిభావం వుట్టిపడే అలాంటి కేంద్రం నేడు ఎన్నికల ప్రచార కేంద్రంగా మారింది. నేతలందరూ ఇక్కడకు విచ్చేసి బంధుగణాన్ని, అనుచరగణాన్ని కలుసుకొనేందుకు, చాముండేశ్వరి దేవి ఆశీస్సులు అందుకొనేందుకు వస్తుండడంతో నిత్యం ఎన్నికల హడావిడి కన్పిస్తోంది ఈ ప్రాంతంలో. త్వరలో జరుగనున్న కోవూరు ఉపఎన్నికల బరిలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ పక్షాన అభ్యర్థిగా నిలుస్తున్న మాజీ ఎమ్మెల్యే నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి, టిడిపి అభ్యర్థిగా పోటీ చేస్తున్న సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఇరువురు ఇందుకూరుపేట మండలంపై దృష్టి కేంద్రీకరించారు. గతంలో సర్వేపల్లి నియోజకవర్గంలో వున్న ఈ

## ఇక్కడ నుంచే ఉప ఎన్నికల ప్రచారం

మండలం నియోజకవర్గాల పునర్‌వ్యవస్థీకరణలో కోవూరు నియోజకవర్గంలో కలిసింది. దీంతో ఎవరికి వారు మండలంలో తమకున్న బంధుమిత్రులు, అనుచరులను కలుసుకొని తమ పట్టు నిలుపుకొనేందుకు ప్రయత్నించడంతోపాటు అమ్మవారి ఆశీస్సుల కోసం తరచూ గంగపట్నం రావడం ప్రాధాన్యత సంతరించుకొంది. అందులోను ప్రసన్న, సోమిరెడ్డి బావా మరుదులు కావడం, ఇరువురికి బంధుత్వాలు వుండడంతో పోటీపోటీగా ఓటర్లను కలుసుకోవడంతోపాటు విజయానికి ఇప్పటి నుంచే చాపక్రింద నీరులా ప్రణాళికలు రచిస్తున్నారు. దీంతో కోవూరు నియోజకవర్గంలో జరిగే ఉప ఎన్నికలలో ఇందుకూరుపేట మండలం కీలకం కానుంది.

# తెలుగు తమ్ముళ్ల అలక!

సూళ్లూరుపేటలో జరిగిన ఫ్లెమింగో ఫెస్టివల్‌లో తమకు ప్రాధాన్యత కల్పించలేదంటూ తెలుగుదేశం ఎమ్మెల్యేలు అలక బూనారు. అట్టహాసంగా జరిగిన ఈ కార్యక్రమం తెలుగుదేశం పార్టీ శాసనసభ్యుడైన పరసారత్నం నియోజకవర్గం అయినప్పటికీ తెలుగు తమ్ముళ్లకు ప్రాధాన్యత లేకపోవడం విశేషం. పార్టీలకు అతీతంగా జరగాల్సిన పక్షుల పండుగ అంతా అమాత్యులు, ప్రజాప్రతినిధులు కాంగ్రెస్‌పార్టీ కార్యక్రమంగా జరిపించే ప్రయత్నం చేశారని, ఎక్కడా తమ పేర్ల ప్రస్తావించలేదంటూ కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు, వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ చిర్రుబుర్రులాడటమేగాక, అసంతృప్తి వ్యక్తం చేశారు. అంతటితో ఆగక మొక్కుబడిగా

### కాంగ్రెస్‌పార్టీ కార్యక్రమంలా ఫ్లెమింగో ఫెస్టివల్!

పాల్గొని మధ్యలోనే వెళ్లిపోవడం చర్చనీయాంశం అయ్యింది. స్థానిక శాసనసభ్యుడు పరసారత్నం వున్నప్పటికీ వీరిని సముదాయించకపోవడం, కాంగ్రెస్ నేతలతో రాసుకపూసుక తిరగడం పట్ల తమ అసంతృప్తిని బాహటంగానే వ్యక్తం చేశారు. దీనికి తోడు ఉదయం 9 గంటలకు ప్రారంభం కావాల్సిన ఫెస్టివల్ ఆలస్యంగా మంత్రులొచ్చిన తర్వాత ప్రారంభం కావడంతో పక్షులను చూసేందుకు జిల్లా నలుమూలల నుంచి వచ్చిన పసిపిల్లలు, పెద్దలు ఇబ్బంది పడాల్సి వచ్చింది. చివరకు కూర్చొనేందుకు కుర్చీలు లేక క్రింద కూర్చోవాల్సి రావడంతో మంత్రులు, అధికారులు, నిర్వాహకులను నోరారా తిట్టుకున్నారు కార్యక్రమానికి హాజరైనవారు.

● గూడూరులో వూపందుకొన్న

# రైల్వే ఫ్లైఓవర్ బ్రిడ్జి పనులు!

## ఇబ్బందిపడుతున్నా సహకరిస్తున్న జనం

గూడూరులో ఏడాది క్రిందట ప్రారంభమైన రైల్వే ఓవర్ బ్రిడ్జి పనులు ఊపందుకున్నాయి. వన్‌టౌన్, టుటౌన్‌లను కలుపుతూ ఐసిఎస్ రోడ్డు నుంచి సొసైటీ సెంటర్ మీదుగా అటవీకాలనీలోకి, మాలవ్యనగర్ వైపుగా బ్రిడ్జి నిర్మాణం జరుగుతున్నది. దీని అంచనా వ్యయం 39కోట్ల రూపాయలు కాగా, అందులో రైల్వేశాఖ 15కోట్లు, ఆర్అండ్‌బిశాఖ 24కోట్లు మంజూరు చేశారు. వచ్చే ఏడాది ఆఖరికి ఈ నిర్మాణం పూర్తి కావాల్సి వుండగా ప్రారంభంలో కొంత ఆలస్యం జరిగినా బ్రిడ్జి నిర్మాణ పనులు ఇటీవల చకచకా జరుగుతున్నాయి. ఇప్పటికే వన్‌టౌన్‌లో స్పాన్‌లన్నీ పూర్తి అవగా, టుటౌన్‌లో అటవీకాలని, నెల్‌కాస్ట్ ఫ్యాక్టరీ వైపుగా స్పాన్‌ల నిర్మాణం జరగాల్సి వుంది. ఆ మార్గంలో ఫ్యాక్టరీ కాలనీలలోని ప్రజలు రాకపోకలు సాగించడానికి అంతరాయం కల్గుతుండడంతో ప్రత్యామ్నాయంగా మరొక మార్గాన్ని చూపించి అనంతరం ఇక్కడ స్పాన్‌ల నిర్మాణం చేపట్టనున్నట్లు అధికారులు చెప్తున్నారు. బ్రిడ్జి నిర్మాణ పనులు చేపట్టిన నాటి నుంచి పలు ప్రాంతాల ప్రజలకు రాకపోకలు సాగించడానికి కష్టతరంగా వున్నప్పటికీ వాటిని భరిస్తుండడం విశేషం. ఏ చిన్న అభివృద్ధి కార్యక్రమం చేపట్టినా అడుగడుగునా అడ్డు తగిలే వ్యక్తులు, శక్తులు వున్న గూడూరులో ఇంత పెద్ద కార్యక్రమానికి మాత్రం ఎలాంటి విఘ్నాలు కలగకుండా పనులు వేగంగా జరుగుతుండడం పట్ల పట్టణ ప్రజలు హర్షం వ్యక్తం చేస్తున్నారు.

# వెంకటగిరిలో సంక్రాంతి సందడి!

రంగవల్లులు, ఆటలు, పాటల పోటీలతో వెంకటగిరి నియోజకవర్గంలో సందడి నెలకొంది. సంక్రాంతి పండుగను పురస్కరించుకొని స్థానిక శాసనసభ్యుడు కురుగొండ్ల రామకృష్ణ సొంత ఖర్చులతో నియోజకవర్గంలోని అన్ని మండల కేంద్రాలలో ఈ పోటీలను నిర్వహించడం విశేషం. వెంకటగిరి పట్టణంతోపాటు వివిధ గ్రామాలలోని మహిళలకు ప్రత్యేకంగా ఈ పోటీలు నిర్వహించడంతో అధికసంఖ్యలో మహిళలు ముగ్గులు, ఆటలు, పాటల పోటీలలో పాల్గొన్నారు. బహుమతి ప్రదానోత్సవం స్థానిక బాలికోన్నత పాఠశాలలో జరిగింది. ఈ సందర్భంగా ఎమ్మెల్యే కురుగొండ్ల మాట్లాడుతూ సంక్రాంతి అంటే పెద్ద పండుగ అని, పల్లెలు పంట చేతికొచ్చి కళకళలాడుతుంటాయని అలాంటి వాతావరణం నేడు కనుమరుగౌతున్నదని ఆవేదన వ్యక్తం చేశారు. మన సంస్కృతి సాంప్రదాయాలు కనుమరుగు కాకూడదనే ఉద్దేశంతో ప్రజలను చైతన్య పరచి, వారిలో ఉత్సాహాన్ని నింపేందుకు ఈ కార్యక్రమాన్ని చేపట్టామన్నారు. ముఖ్యంగా మహిళలు ఉత్సాహంగా వివిధ పోటీలలో పాల్గొనడం సంతోషకరమన్నారు. ప్రభుత్వ నిధులు నియోజక

## సొంత నిధులతో పోటీలు పెట్టిన కురుగొండ్ల

వర్గానికి పెద్దగా అందకపోయినా సొంత ఖర్చులతో రామకృష్ణ ఇలాంటి కార్యక్రమాలను నిర్వహిస్తుండడం పట్ల ప్రజలు అభినందిస్తున్నారు. ఈ బహుమతి ప్రదానోత్సవ కార్యక్రమంలో తెలుగుదేశం నేతలు చెలికం శంకర్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.




వాణిజ్య పన్నుల చెల్లింపుపై అవగాహన పెంపొందించేలా నెల్లూరు వాణిజ్య పన్నుల శాఖ ఉపకమిషనర్ ఎమ్డీ ఇంతియాజ్ వ్రాసిన పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి.

## బ్యాంకులో సిబ్బంది కొరత!

బ్యాంకు సిబ్బంది కొరత కారణంగా పలు గ్రామాల ప్రజలు ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుంది. తోటపల్లి గూడూరు మండలం కోడూరు గ్రామంలో సిండికేట్ బ్యాంకు బ్రాంచి వుంది. చుట్టుప్రక్కల 15 మజరాలకు చెందిన గ్రామస్తులు ఈ బ్యాంకు ద్వారానే లావాదేవీలు జరుపుతుంటారు. వీరే కాకుండా సంఘబంధం పొదుపు గ్రూపులు, ఇతర సంస్థలు ఇక్కడి నుంచే తమ ఖాతాలను నిర్వహిస్తుంటాయి. అంతటి కీలకమైన బ్యాంకులో సిబ్బంది కొరత ఖాతాదారులకు ఇబ్బందులు కలుగజేస్తుంది. గతంలో క్యాషియరు, ఫీల్డ్ ఆఫీసర్, మేనేజర్, అసిస్టెంట్ మేనేజర్ తదితరులు వుండేవాళ్లు. ఇప్పుడు కేవలం ముగ్గురు మాత్రమే అన్ని విధులు నిర్వర్తించాల్సి రావడంతో ఆ ప్రభావం బ్యాంకు లావాదేవీలపై పడుతోంది. నిత్యం రద్దీగా వుండే ఈ బ్యాంకులో సిబ్బంది కొరత వల్ల ఇబ్బందులు ఎదురౌతున్నాయని పలువురు ఖాతాదారులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. చిన్నచిన్న పనులకు, క్షణంలో పూర్తయ్యే పనులకు సైతం గంటల తరబడి ఎదురు చూడాల్సి వస్తోందని, దీనిని గుర్తించి తగినంత సిబ్బందిని నియమించాలని బ్యాంకు ఉన్నతాధికారులను కోరుతున్నారు ఖాతాదారులు.

## మరో రెండు ప్లాట్‌ఫారాలు!

రైల్వే కూడలి అయిన గూడూరు రైల్వేస్టేషన్‌కు అదనంగా మరో రెండు ఫ్లాట్ ఫారాలు ఏర్పాటు కానున్నాయి. నిత్యం ఇక్కడి నుంచి దేశంలోని వివిధ ప్రాంతాలకు వేలాదిమంది రాకపోకలు సాగిస్తుంటారు. అలాగే వివిధ పరిశ్రమల రాకతో ఈ ప్రాంతం అభివృద్ధి చెందుతుండడంతో ప్లాట్‌ఫారాలను పెంచాల్సిన అవసరం ఏర్పడింది. ఈ విషయమై ఇటీవల గూడూరుకు వచ్చిన సౌత్‌సెంట్రల్ రైల్వే జనరల్ మేనేజర్ హస్తానాకు పలువురు విజ్ఞప్తి చేశారు. దీనికి స్పందించిన ఆయన అదనంగా రెండు ఫ్లాట్‌ఫారాలను ఏర్పాటు చేసేందుకు గ్రీన్‌సిగ్నల్ ఇచ్చారు. అలాగే ప్రయాణీకుల రద్దీ దృష్ట్యా మరొక టిక్కెట్ కౌంటర్‌ను ఏర్పాటు చేయాలని గత కొంతకాలంగా పలు మార్లు విజ్ఞప్తి చేస్తున్నారు పుర ప్రముఖులు. దీనికి ఇంకా అధికారుల నుంచి ఎలాంటి హామీ రానప్పటికీ అదనపు ప్లాట్ ఫారాలు మాత్రం ఏడాదిలోపల ఏర్పాటు చేయనున్నారు. స్టేషన్‌కు పడమరవైపు వీటిని నిర్మించనున్నారట.

**గూడూరు స్టేషన్‌లో అదనపు సౌకర్యం**

## నటన వద్దు... పని చేయండి!

**వైద్య సిబ్బందికి డిఎంఅండ్‌హెచ్‌ఓ సూచన**

నటించొద్దు సేవచేయండి అని వైద్య ఆరోగ్యశాఖాధికారి డాక్టర్ మాసిలామణి నాయుడుపేట ఆస్పత్రి సిబ్బందిని హెచ్చరించారు. ఇటీవల ఆ ఆస్పత్రిని ఆకస్మిక తనిఖీ చేసిన ఆయన రోగులు పడుతున్న ఇబ్బందులను స్వయంగా పరిశీలించారు. పెళ్లకూరు మండలానికి చెందిన ఓ మహిళకు జననీ సురక్ష పథకం క్రింద ప్రభుత్వం అందజేసే నగదును ఇవ్వకపోవడాన్ని గుర్తించిన అధికారి ఆస్పత్రి వైద్యులపై తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. డ్యూటీలో వుండాల్సిన డాక్టర్ రమణయ్య విధులకు సెలవు పెట్టకుండా గైర్హాజరు కావడాన్ని గమనించిన మాసిలామణి ఆయనకు రిజిస్టర్‌లో ఆబ్‌సెంట్ మార్క్ వేశాడు. తక్షణం ఆ డాక్టర్‌కు మెమో జారీ చేయాలని డిప్యూటీ సివిల్ సర్జన్ హరిప్రియను ఆదేశించాడు. అలాగే అక్కడ వుండే ఎక్స్‌రే మిషన్ పనిచేయకపోవడాన్ని గుర్తించిన ఆయన తక్షణం దీనిని మరమ్మత్తులు చేయించాలన్నారు. ఆస్పత్రి ప్రాంగణాన్ని, గదులను పరిశీలించిన డిఎంహెచ్‌ఓ అపరిశుభ్ర వాతావరణం నెలకొని వుండడం, సిబ్బంది సక్రమంగా విధులు నిర్వర్తించకపోవడంపై తీవ్రంగా మండిపడ్డారు. పిచ్చిపిచ్చి వేషాలు వేయొద్దు జాగ్రత్తగా పని చేయండి లేదంటే చర్యలు తప్పవన్నారాయన.

# రెవిన్యూ సదస్సులు నిరుపయోగం!

- **అర్జీలు తీసుకొని చేతులు దులుపుకొన్నారు.**

చిన్న, సన్నకారు రైతుల భూ సమస్యలను పరిష్కరించేందుకు నిర్వహించిన రెవెన్యూ సదస్సులు ఉపయోగం లేకుండాపోయాయి. అధికారులు నామమాత్రంగా హాజరు కావడం, అర్జీలు స్వీకరించి చేతులు దులుపుకోవడం తప్ప రైతుల సమస్యలు పరిష్కరించలేకపోవడంతో సదస్సుల ఉద్దేశ్యమే దెబ్బతినిపోయింది. భూ ఆక్రమణలు, కాలువలు, గుంటలు ఆక్రమించిన వారిపై రైతులు ఫిర్యాదుచేసినా, సిజేఎఫ్ఎస్, అసైన్‌మెంట్ భూములను ఆక్రమించిన వారి గురించి సమాచారం అందించినా అధికారులు ఏమాత్రం స్పందించకపోవడంతో రెవెన్యూ సదస్సులు ఘోరంగా విఫలమయ్యాయి. జిల్లా ఉన్నతాధికారులు ఈ సదస్సులను వినియోగించుకోవాలని, పలు సమస్యల పరిష్కారానికి ఇవి ఉపయోగడతాయని చెప్పినా ఏమాత్రం సదస్సులు ఉపయోగపడిన దాఖలాలు లేవు. విడవలూరు, వెంకటగిరి, కలువాయి తదితర ప్రాంతాలలో రైతుల నుంచి తీవ్ర వ్యతిరేకత వ్యక్తమయ్యింది. వెంకటగిరి మండలం కలపాడు గ్రామంలో అయితే సదస్సును అడ్డుకోవడంతో పాటు ఏకంగా అధికారులను నిర్భందించారు. విడవలూరులో రైతులు ఏకంగా అధికారులను భూ ఆక్రమణలు తదితర సమస్యలపై నిలదీసినా ప్రయోజనం లేకుండా పోయింది. కొన్నిచోట్ల అధికారులు లేక సదస్సులు జరగలేదు. మరికొన్ని చోట్ల తూతూ మంత్రంగా జరిపి చేతులు దులుపుకోవడంతో రెవెన్యూ సదస్సులు నిష్ప్రయోజనంగా మారాయి.

## తెలంగాణపై జగన్ దృష్టి!




తెలంగాణలో రైతు పోరుదీక్ష విజయవంతం కావడంతో జగన్ ఇప్పుడు తెలంగాణ నాయకులపై దృష్టి పెట్టాడు. వచ్చే సార్వత్రిక ఎన్నికల నాటికి తెలంగాణలో పట్టు సాధించాలన్నది జగన్ అభిప్రాయంగా వుంది. దీని కోసం తెలంగాణ రాజకీయ నాయకులతో మంతనాలు ప్రారంభించాడు. ఇప్పటికే మాజీ మంత్రులు సంతోష్‌రెడ్డి, బోడ జనార్దన్, మాజీ ఎమ్మీ గంగారెడ్డి జగన్ పార్టీలో చేరారు. ప్రస్తుతం టిఆర్ఎస్, తెలుగుదేశం పార్టీల్లో అసంతృప్తిగా వున్నవారిని ఆకర్షించడానికి జగన్ పావులు కదుపుతున్నాడు. త్వరలో జరుగనున్న ఉప ఎన్నికల్లో తమపార్టీ పోటీ చేయడం లేదంటూ జగన్ ఇప్పటికే ప్రకటించాడు. తెలంగాణ ఉద్యమ సెంటిమెంట్‌లో ఉప ఎన్నికల్లో పోటీ చేయడం వల్ల పెద్దగా ఉపయోగముండదని జగన్ భావిస్తున్నాడు. అందుకే ఉపఎన్నికల బరిలోకి దిగకుండా వచ్చే రెండేళ్లలో తెలంగాణలో పార్టీని పటిష్టం చేసుకోవాలన్నది జగన్ నిర్ణయం. అయితే ఉప ఎన్నికల్లో పోటీ చేయడం ద్వారా తెలంగాణలో తమపార్టీ ఉనికిని చాటుకోవాలని ఆ ప్రాంత నాయకులు జగన్‌పై ఒత్తిడి తెస్తున్నారు. చూద్దాం... ఏం జరుగుతుందో!!

## అనర్హత కేసుల్లో సభాపతులు బిజీ బిజీ



ఎమ్మెల్యేల అనర్హత నిర్ణయం కేసుల్లో శాసనసభ స్పీకర్ నాదెండ్ల మనోహర్, శాసనమండలి ఛైర్మన్ చక్రపాణి బిజీబిజీగా వున్నారు. శాసనసభలో అవిశ్వాస తీర్మానానికి వ్యతిరేకంగా ఓటు చేయాలన్న కాంగ్రెస్, ప్రజారాజ్యం పార్టీ విప్‌లను ధిక్కరించిన ఎమ్మెల్యేలపై చర్య తీసుకోవాలంటూ ఆ పార్టీలు అందజేసిన ఫిర్యాదులపై సభాపతులు దృష్టి పెట్టారు. కాంగ్రెస్‌కు చెందిన 17మంది ఎమ్మెల్యేలు, పిఆర్‌పికి చెందిన ఇరువురిపై చర్య తీసుకోవడానికి రంగం సిద్ధమైంది. శాసన మండలిలో కూడా జగన్ వర్గానికి ఫిరాయించిన ఎమ్మెల్సీలపై కూడా కాంగ్రెస్ చేసిన ఫిర్యాదుపై మండలి ఛైర్మన్ చక్రపాణి దృష్టి పెట్టారు. బుధవారం నుంచి తుదివిచారణను ప్రారంభించారు. మరో రెండువారాల్లోగా దారికిరాని ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలను అనర్హులుగా ప్రకటించే అవకాశముందని విశ్వసనీయ వర్గాల సమాచారం. ఇప్పటికైనా సమయం మించిపోలేదని చెంపలేసుకొని తిరిగి కాంగ్రెస్ గూటికి రావచ్చని సిఎం కిరణ్ రహస్య సందేశం పంపారట. చూద్దాం... సిఎం సందేశం ఏమాత్రం పని చేస్తుందో.

## ఆచార్య అరెస్ట్‌కు రంగం సిద్ధం



సీనియర్ ఐఎఎస్, ఎమ్మార్ కేసులో ప్రధాన నిందితుడు బిపి ఆచార్య అరెస్ట్‌కు సిబిఐ రంగం సిద్ధం చేసింది. ఎమ్మార్ విల్లా కేసులో ఇప్పటికే కోనేరు ప్రసాద్ అరెస్ట్ అయ్యాడు. ఇప్పుడు బిపి ఆచార్యను కూడా అరెస్ట్ చేసి ఈ కేసును ఓ కొలిక్కి తేవాలని సిబిఐ భావిస్తోంది. ఇందులో భాగంగానే ఈనెల 23న ఆచార్యను విచారణకు పిలిచారు. గతంలో ఆచార్యను పలుమార్లు ప్రశ్నించిన సిబిఐ ఈ కేసుకు సంబంధించి పలు కీలకాధారాల్ని సేకరించింది. వీటి ఆధారంగా తిరిగి ఆచార్యను విచారించి అరెస్టు చేయాలని నిర్ణయించినట్లు అభిజ్ఞ వర్గాల భోగట్టా. ఈ కేసులో తమ ప్రమేయం ఏదీ లేదని ఆచార్య గతంలో సిబిఐ ముందు ఇచ్చిన వాఙ్మూలాన్ని సిబిఐ నమ్మడం లేదు. రాజకీయ ఒత్తిడులకు లొంగి విచక్షణా రహితంగా ఆచార్య వ్యవహరించాడని నిరూపించే ఆధారాలు ఇప్పుడు సిబిఐ దగ్గర వున్నాయట. సో... వచ్చేవారం ఆచార్య కూడా శ్రీకృష్ణ జన్మస్థానానికి వెళ్లక తప్పదంటున్నారు. ఏంచేద్దాం... చేసుకున్నవారికి చేసుకున్నంత...!!

## 'చిరు'పై ఎమ్మెల్యేల కన్నెర్ర



చిరంజీవిపై ప్రజారాజ్యంపార్టీ ఎమ్మెల్యేలు కన్నెర్ర చేస్తున్నారు. ప్రజారాజ్యం కాంగ్రెస్‌లోకి విలీనం అయ్యాక జరుగనున్న మంత్రివర్గ విస్తరణలో 'చిరు' సిఫార్సుల పట్ల ఎమ్మెల్యేలు ఆగ్రహంతో ఊగిపోతున్నారు. 'చిరు' తన సామాజిక వర్గానికి చెందిన రామచంద్రయ్య, గంటా శ్రీనివాసరావును సిఫార్సు చేయడం అన్యాయమంటూ ఎమ్మెల్యేలు రచ్చకెక్కుతున్నారు. ప్రజారాజ్యం పార్టీలోని ఇతర సామాజిక వర్గాలను 'చిరు' అవమానిస్తున్నారంటూ వారు విమర్శిస్తున్నారు. చిరు సిఫార్సులతో నిమిత్తం లేకుండా అర్హులైన వారికి, సీనియర్లకు మంత్రి పదవులు ఇవ్వాలంటూ వంగా గీతతోపాటు మరికొందరు ఎమ్మెల్యేలు సిఎంను కలిసి తమగోడు వెళ్లబోసుకున్నారు. అయితే 'చిరు' సిఫార్సు లేకుండా తాను చేయగలిగిందేంలేదంటూ సిఎం చేతులెత్తేశాడట. దీంతో ఈ వ్యవహారాన్ని 'చిరు'తోనే తేల్చుకోవాలని పిఆర్‌పి ఎమ్మెల్యేలు రంగం సిద్ధం చేస్తున్నారు. పాపం! 'చిరు' కష్టాలు ఎప్పుడు తీరుతాయో కదా!






కనుమ తెప్పోత్సవానికి సిద్ధమైన నవాబుపేటలోని భ్రమరాంబసమేత ఉదయకాళేశ్వరుడు.



నెల్లూరు తెలుగుదేశం పార్టీ ఆఫీసులో విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న ఆ పార్టీ సీనియర్ నేత గాలి ముద్దుకృష్ణమ నాయుడు. ప్రక్కన రమేష్‌రెడ్డి, వెంకటస్వామినాయుడు, కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి.



సంక్రాంతిని పురస్కరించుకొని లేగుంటపాడులో జరిగిన రాష్ట్ర స్థాయి ఎడ్ల పందెం పోటీల్లో సందడి.

# మహిళలకు సర్వ విధాల శుభాన్ని కలుగజేసే సావిత్రిగౌరీ వ్రతం!



మన సంస్కృతి సాంప్రదాయాల్లో వ్రతాలు, నోములకు విశేష ప్రాధాన్యముంది. కుటుంబ అభివృద్ధిని, సుఖశాంతులను కాంక్షిస్తూ చేసే వ్రతాలు, నోచే నోములు కొన్ని అయితే మహిళల సౌభాగ్యాన్ని, సంతాన భాగ్యాన్ని, కుటుంబ క్షేమాన్ని కోరుతూ చేపట్టే వ్రతాలు మరికొన్ని. అలాంటి వాటిలో సావిత్రి గౌరీదేవి వ్రతం ఒకటి. భోగి, సంక్రాంతి, కనుమ పండుగలు వెళ్లిన తర్వాత ఈ వ్రతాన్ని ఆచరించడం సాంప్రదాయంగా వస్తోంది. ఈ వ్రతానికే బొమ్మల నోము అనే పేరు కూడా వుంది.

సావిత్రి గౌరీ దేవి వ్రతానికి సంబంధించి పురాణ కథ ఒకటి ప్రచారంలో వుంది. ఒకనాడు కైలాసగిరి మీద వున్న పరమేశ్వరునితో పార్వతిదేవి ముచ్చటిస్తున్న సమయంలో మహిళల కష్టాల గురించి ప్రస్తావన వచ్చింది. పార్వతిదేవి స్త్రీల సమస్యలు, కుటుంబాన్ని, భర్త, సంతానం కోసం మహిళలు పడే తపన గురించి వివరిస్తూ వారి కష్టాలు తొలగి, సుఖశాంతులు కలిగేలా, సౌభాగ్యం లభించేలా ఏదైనా వ్రతాన్ని గురించి చెప్పమని ఈశ్వరుడిని కోరింది. హిమపుత్రి మాటలు, ఆమె కోరికను అర్థం చేసుకొన్న పరమేశ్వరుడు వనితలకు సర్వవిధాల శుభాన్ని కలుగజేసే బొమ్మల నోము గురించి తెలియజెప్పి దాన్ని ఆచరించే విధానాన్ని తెలియజేశాడట. ఆ వ్రతాన్ని స్వయంగా పార్వతి చేయడంతో బొమ్మల నోముకు సావిత్రి గౌరి వ్రతంగా పేరొచ్చింది. శివుని అనుగ్రహంతో వ్రతం ఆచరించిన పార్వతి ఆనాటి నుంచి తన దర్శనానికి వచ్చే స్త్రీలకు వ్రతం గురించి తెలియజెప్పి ఆ వ్రతం వలన కలిగే పుణ్యఫలాలను వివరించి చెప్పడంతో ఎనలేని ప్రాముఖ్యం లభించింది. విశేష ఫలప్రదాయని అయిన బొమ్మల నోమును తొమ్మిది రోజులపాటు చేయాల్సి వుంటుంది. ఈ వ్రతాన్ని ఆచరించేవారు ముందుగా గౌరీదేవి ప్రతిమను ఇంటిలో ఎక్కడైతే బొమ్మలను పెడతారో అక్కడ ప్రతిష్ఠించాలి. అనంతరం వివిధ రకాల బొమ్మలను కొలువుగా, అందంగా అమర్చుకోవాలి. రోజుకొక నైవేద్యం చొప్పున తొమ్మిది రోజులపాటు వివిధ రకాల వంటకాలతో, ధూప దీపాలతో గౌరీదేవిని పూజించాలి. బొమ్మల వద్ద దీపం వెలిగించడంతోపాటు మొదటిరోజున పొంగలి, రెండవ రోజున పాయసం, మూడవరోజున బూరెలు, నాల్గవ రోజున బియ్యం, ఐదవరోజున అరిసెలు, ఆరవ రోజున గారెలు, ఏడవ రోజున అట్లు, ఎనిమిదవ రోజున సున్ని ఉండలు, తొమ్మిదవరోజున పెరుగు, మీగడను నైవేద్యంగా సమర్పించాల్సి వుంటుంది. చివరి రోజున నైవేద్యం అయిన తర్వాత ఉద్యాపన చేయాలి.

ఉద్యాపన సందర్భంగా తొమ్మిది రోజులకు గుర్తుగా తొమ్మిది చేటలు తీసుకొని, వాటిని తొమ్మిది మంది ముత్తయిదువులకు వాయనంగా ఇవ్వాలి. అలా చేయడం వలన సౌభాగ్యం, సంతానం, భోగభాగ్యాలు లభిస్తాయని పురాణాలు చెప్తున్నాయి.

J

## ట్రంకు రోడ్డు

### గడుగ్గాయిని...



తన వ్యతిరేకులను, ప్రతిపక్షీయులను తిట్టిపోయడంలో నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి 'స్పెషలిస్ట్' అనే విషయం అందరికీ తెలిసిందే. అయితే తనను తాను తిట్టుకోవడంలోనూ స్పెషలిస్ట్ నని నిరూపించారాయన. ప్రాథమిక విద్యామంత్రి సాకే శైలజానాథ్ ఇటీవల కలెక్టరేట్‌లో ఏర్పాటుచేసిన సమీక్షా సమావేశంలో వివేకానందరెడ్డి తన బాల్యాన్ని గుర్తుకు తెచ్చుకొన్నారు. నేను ఒకటో తరగతి నుంచి భలే గడుగ్గాయిని. అందువల్లే ఏ స్కూల్‌లోనూ సంవత్సరానికిమించి వుంచుకోలేదు. స్కూళ్లలో వుండే నీటి నిల్వ తొట్లు (సంపు)లలో ఈత కొట్టే వాడిని. నాలుగో తరగతి నుంచి బీడి దమ్ము కొట్టేవాడినని చెప్పడం విన్న ఓ అధికారి అవన్నీ నాకు తెలుసులేండి సార్... నేను మీ క్లాస్‌మేట్ ననడంతో వివేకా నోటికి తాళం పడింది.

### డిపిఆర్వోకు కుడుము!



ఒకప్పుడు జిల్లా పౌర సంబంధ శాఖాధికారి అంటే జిల్లా కలెక్టర్ నుంచి అన్ని శాఖల అధికారులు గౌరవంతో చూసుకొనేవారు. తమ గూర్చి మీడియాలో అనుకూల, వ్యతిరేక వార్తలు ఆయన ద్వారా వచ్చేలా చూసుకొనేవారు. దశాబ్ద కాలం నుంచి డిపిఆర్వోలుగా సమర్థులు కరువయ్యారు. ప్రస్తుతం పనిచేస్తున్న డిపిఆర్వోకు ప్రభుత్వ వాహనం కూడా లేకుండాపోయింది. మరీ అమాయకుడైన ఈ డిపిఆర్వో చేసిన ఆగం మేరకు ఆయనకో జీపును ఈవారం కలెక్టర్ మంజూరు చేశారు. ఇచ్చిన జీపు చూసుకొని కుడుమిస్తే పండుగ సామెతను 'కమలాకరుడు' గుర్తుకు తెస్తుండడంపై మీడియాలో తెగ చర్చ జరుగుతోంది.

### సంస్కృతి మంట కలిసింది



తెలుగు సంస్కృతీ సాంప్రదాయాలు టీవీలు, సెల్‌ఫోన్, ఇంటర్నెట్‌ల మూలంగా మంటగలుస్తున్నాయని జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి ఆవేదన వ్యక్తం చేశారు. స్వర్ణభారత్ ట్రస్ట్ సంక్రాంతి సంబరాల్లో తన అనుభవాలను ఆయన వివరిస్తూ ఆడపిల్లలకు ముగ్గులు వేయడం రావడం లేదు. ఈ మధ్య స్కూళ్ల పరిశీలనకు వెళ్లి లవకుశులు ఎవరంటే సమాధానం చెప్పేవారు లేరు. భక్తరామదాసు ఎవరంటే సినిమా యాక్టర్ అక్కినేని నాగార్జున పేరును ఠక్కున చెబుతున్నారని వాపోయారు.

### నాటు ముక్క లేదు!



సంక్రాంతి పండుగ అంటే సంబరాల పండుగ. భోగి, కనుమపండుగ రోజు ఎన్ని కోళ్లు, పొట్టేళ్లు తెగిపడతాయో లెక్కకట్టలేం. భోగిరోజు దోశ... చికెన్, మటన్ పులుసులతో అల్పాహారం మొదలు పెట్టడం నెల్లూరీయులకు అలవాటు. అటువంటిది ఈ యేడాది భోగిపండుగ శనివారం రావడంతో నాటు ముక్క కొరికే అవకాశం లేకుండాపోయింది. ఆదివారం పెద్దపండుగ రావడంతో సాంబారుతో సర్దుకోవాల్సి వచ్చింది. సోమవారం 'కనుమ' రావడంతో ఈ యేడాది మజాలేకుండా పోయిందని సణిగేవాళ్లు ఎక్కువగా కనపడ్డారు.



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో వున్నవారికి అన్ని కార్యాలందు ప్రతికూలతలు ఏర్పడుతాయి. ఆదాయానికంటే ఖర్చులధికంగా వుంటాయి. శత్రు, ఋణ బాధలుంటాయి. మనసులో విచారం, కోపం. వ్యవసాయ రంగంలోనివారికి ఆదాయ, వ్యయాలు సమానంగా వుంటాయి. విద్యార్థులకు అనుకూలం. సంఘంలోని కుటుంబ పెద్దలచే వ్యతిరేకత ఎదుర్కొంటారు. రాజకోపం, కీర్తి హాని.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి అత్యంత అనుకూలంగా వుంటుంది. యశోవృద్ధి. మనః సౌఖ్యం. ఆర్థికాదాయం వుంటుంది. విద్యార్థులకు మంచి అవకాశం. వ్యవసాయ రంగంలోని వారికి అనుకూలం. స్త్రీ సౌఖ్యం. నూతన నిర్మాణం చేసేవారికి శుభప్రదం. కుటుంబంలో అనుకూలతలుంటాయి. అకారణ ప్రయాణాలచే ధన వ్యయం. శరీర శ్రమ.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి అత్యంత అనుకూలంగా వుంటుంది. దేహ సౌఖ్యం, శరీరారోగ్యం వున్నప్పటికీ నేత్ర బాధలుంటాయి. విద్యార్థులు ధైర్యం, యుక్తి, బుద్ధి చేత విజయం సాధించగలరు. శత్రు జయం. కోర్టు కేసులు వాయిదా వేసుకోవడం మంచిది. వ్యవసాయ, ఇతర రంగాలలోని వారికి చేసే పనులందు విజయం.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాలలో వారు చేసే ప్రయాణాలలో అధిక శ్రమతో కూడిన ఆదాయముంటుంది. ఖర్చులధికం. అలసట, స్థానమార్పులు వుంటాయి. భార్య, పుత్రాదులతో విరోధం. అకాల భోజనం. సంఘంలో పరపతి, గౌరవం వుంటాయి. నూతన వస్త్రాభరణాలు ధరించుట. ఇంటి యందు వేడుకలు. వ్యవసాయ రంగంలో వారికి అనుకూలం. విద్యార్థులకు కష్టంతో కూడిన ప్రతిఫలం.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారు చేసే ప్రయాణాలలో ఆటంకాలు ఏర్పడుట. స్త్రీ మూలంగా భయాందోళనలు సంభవించును. శరీరారోగ్య, సుఖసంతోషాలు వుంటాయి. విద్యార్థులకు అనుకూలం. వ్యవసాయ రంగంలోని వారికి ఆర్థికాదాయాలుంటాయి. నూతన గృహప్రవేశ, ఆరంభాలకు అనుకూలం. స్థానమార్పులు వుంటాయి.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ఈ వారం అన్ని రంగాలలో అననుకూలంగా వుంటుంది. అనవసర ఆటంకాలతో కోపం అధికమౌతుంది. వ్యాపారాలు సామాన్యంగా వుంటాయి. కార్యహాని, మనస్తాపం వుంటుంది. బంధుమిత్రులతో కలహాలు, ధనహాని. విద్యార్థులకు సామాన్యంగా వుంటుంది. వ్యవసాయ రంగంలోని వారికి మేలు. ప్రయాణాలలో జాగ్రత్త అవసరం.

# వారఫలాలు

*తేది 21-01-2012 నుండి 27-01-2012 వరకు మేషంలో గురువు; వృషభంలో కేతువు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో రాహువు; 24వ తేదీ వరకు ధనుస్సులో బుధుడు, తదుపరి మకరరాశిలో ప్రవేశం; మకరంలో రవి; వృశ్చిక, ధనుర్మకర, కుంభాలలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

21వ తేది శని త్రయోదశి.
24తేది మాఘస్నానారంభం.
25తేది రబ్బీ లవ్వల్ నెల ప్రారంభం.
26తేది రిపబ్లిక్ దినోత్సవం.

### శుభ ముహూర్తాలు

25, 26తేదీలలో వివాహాది, గృహారంభ, గృహప్రవేశ, నూతన వ్యాపారాలకు సుముహూర్తములున్నాయి.

### జనవరి తిథులు

**పుష్య బహుళ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 21 | శని | త్రయోదశి | ప | 03.48 | గం.ల.వ |
| 22 | ఆది | చతుర్దశి | ప | 02.19 | గం.ల.వ |
| 23 | సోమ | అమావాస్య | ప | 01.07 | గం.ల.వ |

**మాఘ శుద్ధ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 24 | మంగళ | పాడ్యమి | ప | 12.24 | గం.ల.వ |
| 25 | బుధ | విదియ | ప | 12.13 | గం.ల.వ |
| 26 | గురు | తదియ | ప | 12.40 | గం.ల.వ |
| 27 | శుక్ర | చవితి | ప | 01.53 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, డిఎస్ఆర్ నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారు శరీర బాధలు, అధిక శ్రమలకు లోనౌతారు. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. ఆర్థికాదాయాలలో అనుకూలతలుంటాయి. ఇతరులతో అధికంగా మాట్లాడి వాదనలు పెంచుకోవద్దు, చిక్కులేర్పడతాయి. ఋణబాధలు బాధించగలవు. ఆలస్యమైనా చేసే పనులలో జయం కలుగుతుంది. వ్యవసాయ రంగంలో వారికి, విద్యార్థులకు సామాన్యంగా వుంటుంది.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి అధికశ్రమ, ఔషధ సేవనం, ధనవ్యయం, మానసిక అశాంతి వుంటాయి. కుటుంబంలో వ్యవహారపు చిక్కులు, అధిక ధనవ్యయం. అకాల భోజనం, ఆర్థిక ఇబ్బందులుంటాయి. తరచూ ప్రయాణం చేసేవారికి కీళ్ల హాని వుంటుంది. శత్రుజయం. వ్యవసాయం రంగంలోని వారికి అనుకూలం. విద్యార్థులకు సామాన్యం.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాలలో వారికి కుటుంబంలో సుఖసంతోషాలు వుంటాయి. చిత్తశుద్ధి, స్త్రీ సౌఖ్యం వుంటుంది. బంధుమిత్రులతో సౌఖ్యం. ఋణాలు సకాలంలో వసూలవుతాయి. వ్యవసాయ రంగంలోని వారికి ఆదాయ పుష్టి. విద్యార్థులకు విజయం. అన్ని రంగాలలో వారికి అనుకూలత వుండి, ఇష్టకార్య సిద్ధి కలుగుతుంది.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు సామాన్యంగా వుంటుంది. సమయానికి ధనం అందుబాటులో లేకుండడం, కుటుంబ కలహాలు, ఇంటి నుండి దూరంగా పోవడం, స్థానమార్పులు వుంటాయి. నూతన వస్తు వాహన సౌకర్యం సమకూరుతుంది. శరీర శ్రమ, అకాల భోజనం. వ్యవసాయం శ్రమతో కూడిన ఆదాయం. విద్యార్థులు కష్టపడి ఉత్తీర్ణత సాధించగలరు.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి సామాన్యంగా వుంటుంది. ఇష్టకార్య సిద్ధి, సుఖదుఃఖాలు సమానంగా వుంటాయి. శరీరశ్రమకు తగిన ఫలితం లేకపోవుట, అనుకూలతలేని ప్రయాణాలతో అలసట, అప్పులు, స్త్రీల వల్ల భయం, ఆర్థిక నష్టాలు కలిగించును. విద్యార్థులు తమ బుద్ధి, వివేకాన్ని వినియోగిస్తే సఫలమవుతారు. వ్యవసాయదారులకు కొంతలో కొంత మేలు.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు అత్యంత అనుకూలంగా వుంటుంది. వివాహాది శుభకార్యాలు జయప్రదమౌతాయి. యశోవృద్ధి, ఆర్థికాదాయం వుంటుంది. కాని శరీరారోగ్య విషయమై అధిక శ్రద్ధ అవసరం. వ్యవసాయ రంగంలో వారికి ప్రతికూలంగా వుంటుంది. విద్యార్థులకు సామాన్య ఫలితాలుంటాయి. సామాన్య, చేతివృత్తి పనివారలకు మర్యాద హాని, మనోవిచారం, విశిష్ట నష్టాలుంటాయి.

# నిర్మాణంలో దిక్కులు పెరగకూడదు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఇ.వి.మైథిలీరెడ్డి — చెన్నై*

** ప్లాటు నిర్మాణంలో ఈశాన్యం, నైరుతి పెరిగాయి. ఆరోగ్య, ఆర్థిక సమస్యలున్నాయి. ఏం చేయాలి?*

నిర్మాణంలో దిక్కులు పెరగకూడదు. మీ వివరణలను బట్టి దిక్ప్రభావాలున్నాయి. జన్మతేదీలు పంపినట్లైతే నరఘోష లేక సుదర్శన యంత్రమా అన్నదాన్ని నిర్ధారిస్తాము.

*డాక్టర్ యతిరాజులు — కావలి*

** శాస్త్రం భగవంతుడికంటే గొప్పదా?*

శాస్త్రాల సృజనకారుడు భగవంతుడు. అవి ఎప్పటికీ భగవంతుణ్ని అధిగమించలేవు. భక్త మార్కండేయుని విషయమే చూడండి. శాస్త్రనిర్ధారణ, శివుడి కృప వేరు వేరని అర్థమయింది కదా?

*జి.వి.రవీంద్రనాధ్ — పెనుగొండ*

** సంపాదన పూర్తిగా ఖర్చు అయిపోయి అప్పులు మిగులుతున్నాయి. పరిష్కారం చెప్పండి?*

జాతకం, ప్లాను పరిశీలించాను. పుట్టిన తేదీ, సమయం అందులో పేర్కొనలేదు. మీరు 'లక్ష్మీకృత వాస్తు యంత్రాన్ని' దేవుడి గదిలో ప్రతిష్టించుకోండి.

*డాక్టర్ పరబ్రహ్మశాస్త్రి — చెన్నై*

** కేతు దశ ఉచ్ఛంలో, నీచంలో పరిస్థితులెలా ఉంటాయి?*

కేతు దశ ఏడు సంవత్సరాలు. ఉచ్ఛంలో శుభాలు, నీచంలో ఖర్చు, జబ్బులు, సమస్యలు ఉంటాయి. మీకు ఏడవ గడిలో కేతువు ఉండటం వల్ల మానసిక ఒత్తిడులు, అనారోగ్యం, కళత్రనష్టం జరిగాయి. మీరు 'సుదర్శన' యంత్ర ప్రతిష్ట చేయండి.

*సిహెచ్.రామానాయుడు — బుచ్చిరెడ్డిపాళెం*

** ట్రాక్టరు తెస్తే రిపేర్లు, ఎద్దులు తెస్తే మరణాలు. కారణం ఏమిటి?*

గృహవాస్తులో పద్మ విదిశలు నాభిస్థానంలో విభేదిస్తే ఫలితాలిలాగే ఉంటాయి. మీరు 'శక్తి యంత్ర' ప్రతిష్ట చేయండి.

*వై.శ్రీరాములు — నాయుడుపేట*

** 'వాస్తు' కత్తెర వచ్చే యేడు ఎప్పటినుంచి ఎప్పటివరకు ఉంటుంది?*

4 మే నెల 2012 వాస్తు కర్తరి ప్రారంభమై మే 28 సోమవారం జ్యేష్ఠ శుక్ల సప్తమి మధ్యాహ్నం 12.45 నిమిషాలకు రోహిణి నక్షత్రం ద్వితీయ పాదంలోకి ప్రవేశించడం వల్ల పూర్తి అవుతుంది.

*డి.రాజశేఖర్‌రెడ్డి — బెంగుళూరు*

** అబ్బాయి ఏ వ్యాపారంలోనూ రాణించలేకపోతున్నాడు. రాజకీయాల్లో చాలా డబ్బు పోగొట్టాడు.*

అబ్బాయి పేర నిర్మించిన యింట్లో తూర్పు దోషాలున్నాయి. తూర్పు హద్దు నిర్మాణాలు తీసివేయండి. 'లక్ష్మీగణపతి' యంత్రం మీ సమస్యని పరిష్కరిస్తుంది.

*వై.లక్ష్మణరావు — నాయుడుపేట*

** వాస్తు 'కత్తెర'లో చేయదగినవి, చేయకూడని పనులు ఏవి?*

ఈ సమయంలో శంఖుస్థాపనలు నిషిద్ధం. లగ్న, నక్షత్ర, రాశి బలాల్ని బట్టి గృహాలకు మరమ్మత్తులు, గృహప్రవేశ కార్యక్రమాలు చేసుకోవచ్చును!

*పేర్నేటి శంకరరావు — ఒంగోలు*

** తూర్పు ఇల్లు, పశ్చిమ యింటి తలుపు పెట్టుకోవచ్చా?*

పశ్చిమం గ్రామశక్తి చూపు మీ ఇళ్లపై ఉండటం వల్ల పశ్చిమ ద్వారాన్ని మూసివేసి ఉత్తర ఈశాన్యం ద్వారాన్ని తెరవండి.

*జె.ఎన్.కుమారి — సికింద్రాబాద్*

** పిల్లలు చదువులో బాగా వెనుకబడిపోయారు. ఆరోగ్య సమస్యలు లేవు.*

ప్లాటు ప్లానులో బాగా వాయువ్యం వైపు పెరిగింది. పిల్లల జాతకాలు పంపినట్లైతే కుబేర లేక వాస్తు యంత్రాలలో మంత్రబీజాక్షరాలతో 'సరస్వతి' ప్రభావాన్ని గణించి సలహాయిస్తాము.

*పి.జానకీరామానాయుడు — నాయుడుపేట*

** మాకు జాతకాల మీద నమ్మకం లేదు. ఇప్పుడు మమ్మల్ని వెళ్లి పొమ్మంటున్నారు.*

మీ నమ్మకాల్ని ఆ అమ్మాయిపై రుద్దడం ఏమీ బాగాలేదు. మీ ప్రవర్తన మీ కుమారుడికే నచ్చలేదంటే మీరు ఎలా ప్రవర్తించి ఉంటారో అర్థం చేసుకోవచ్చు. పరిస్థితిని ఏ 'యంత్రమూ' బాగు చేయలేదు.

# రాజీవ్ విద్యామిషన్ పనితీరుపై ఆరోపణల వెల్లువ!

**రాజీవ్ విద్యామిషన్ నేతృత్వంలో జిల్లాలోని పాఠశాలల్లో అదనపు గదుల నిర్మాణం చేపడుతున్నారు. వీటి నిర్మాణం చేపడుతున్న కాంట్రాక్టర్లకు పనులు అప్పగించే విషయం దగ్గర నుంచి పూర్తయ్యే వరకు పలు అవినీతి అక్రమాలు జరుగుతున్నాయన్న ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి.**

జిల్లా రాజీవ్ విద్యామిషన్‌పై పలు అవినీతి ఆరోపణలు విన వస్తున్నాయి. పాఠశాలల్లో అదనపు గదుల నిర్మాణాలు చేపట్టేందుకు ప్రభుత్వం ప్రతి సంవత్సరం కోట్ల రూపాయల నిధులు విడుదల చేస్తుంది. పాఠశాల గదుల నిర్మాణాలు చేపట్టే పనులను కాంట్రాక్టర్లకు అప్పగించే విషయం దగ్గర నుంచి పనులు పూర్తి చేసి బిల్లులు చెల్లించే వరకు ఈ శాఖ అధికారులు అవినీతి, అక్రమాలకు పాల్పడుతుంటారు. ప్రభుత్వ నిబంధనలకు విరుద్ధంగా గదుల నిర్మాణం చేపట్టడం, నాసిరకంగా నిర్మించడం వంటి పనులు చేస్తున్నారు. నిత్యం పనుల పర్యవేక్షణ, తనిఖీలు చేయాల్సిన ఇంజనీరింగ్ విభాగం అధికారులు ఆ వైపు కన్నెత్తి కూడా చూడని పరిస్థితి. దీంతో పనులు దక్కించుకున్న కాంట్రాక్టర్లు ఇష్టానుసారంగా నిర్మాణాలు చేపడుతున్నారు.

రాష్ట్ర ప్రభుత్వం ఒక్కో పాఠశాల భవన నిర్మాణానికి 4.30 లక్షల రూపాయలు కేటాయించడం జరిగింది. అయితే ఇక్కడ అధికారులు 5.30 లక్షల రూపాయలు కేటాయించి పాఠశాల భవనాలు నిర్మించడం వివాదాస్పదంగా మారింది. ప్రభుత్వం కేటాయించిన నిధులకంటే అదనంగా లక్ష రూపాయలను ఖర్చు చేసి కాంట్రాక్టర్లకు ప్రయోజనం కలిగే విధంగా వ్యవహరిస్తున్నారు. రాష్ట్రవ్యాప్తంగా అన్ని జిల్లాల్లో ఒకే విధానం అమలు జరుగు తుండగా మన జిల్లాలో మాత్రం దీనికి భిన్నంగా ఉంది. అధికారులు కమీషన్లకు కక్కుర్తిపడి ప్రభుత్వ నిబంధనలను ఖాతరు చేయడం లేదన్న అభిప్రాయం ఏర్పడింది. ఇటీవల ఈ శాఖ మంత్రి శైలజానాథ్ జిల్లా పర్యటనకు వచ్చిన సందర్భంగా నిర్వహించిన సమీక్షా సమావేశంలో అధికారులు వ్యవహరిస్తున్న తీరు బహిర్గతమైంది. జిల్లా కలెక్టర్ సమక్షంలో మంత్రి అడిగిన పలు ప్రశ్నలకు అధికారులు స్పష్టమైన సమాధానం చెప్పలేక నీళ్ల నమలాల్సి వచ్చింది. పాఠశాల భవన నిర్మాణానికి ప్రభుత్వం 4.30 లక్షల రూపాయలు కేటాయిస్తే 5.30 లక్షల రూపాయలు ఎందుకు ఖర్చుచేస్తున్నారని రాజీవ్ విద్యామిషన్ పిఓ జిలానీబాషను నిలదీశారాయన.

మిగిలిన జిల్లాల్లో ఒకే విధానం పాటిస్తుంటే నెల్లూరు జిల్లాలో మరో విధానం పాటించడం ఏమిటని ఆగ్రహించారు. మెటీరియల్ ధరలు పెరిగిన కారణంగా అంచనాలను మార్చాల్సి వచ్చిందని ఇంజనీరింగ్ విభాగం ఇ.ఇ సమాధానం చెప్పబోగా ఎవరి అనుమతి తీసుకున్నారో చెప్పాలని మంత్రి ప్రశ్నించడం జరిగింది. దీంతో ఇ.ఇ మౌనంగా ఉండిపోక తప్పలేదు. పాఠశాలల గదుల నిర్మాణానికి కేటాయించిన నిధులను ఇష్టానుసారంగా ఖర్చు చేయడం పట్ల ప్రభుత్వం విచారణకు ఆదేశించే అవకాశం ఉందని మంత్రి వ్యాఖ్యలను బట్టి అర్థమవుతుంది. జిల్లాలో 2010 – 11, 2011 – 12 ఆర్థిక సంవత్సరంలో చేపట్టిన గదులు, పాఠశాల భవన నిర్మాణాలకు కేటాయించిన నిధులలో కోట్ల రూపాయలు దుర్వినియోగం జరిగాయన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి.


ఆర్వీఎం సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న మంత్రి సాకే శైలజానాథ్.

ఈ శాఖ ఆధ్వర్యంలో చేపట్టే ప్రతి పనిని రాజకీయ నేతలు సూచించిన కాంట్రాక్టర్లకే ఇస్తున్నారు. భవనాల విషయంలో నాణ్యతా ప్రమాణాలు పాటించకపోయినా ఎవరూ పట్టించుకోకపోగా ఎటువంటి ఇబ్బంది లేకుండా నిర్ణీత సమయంలో బిల్లుల చెల్లింపు చేసేస్తున్నారు. రాజీవ్ విద్యామిషన్‌కు కేటాయించిన భవనాల లక్ష్యాలను పూర్తి చేయలేక పోతున్నారు. ఇప్పటి వరకు కేటాయించిన లక్ష్యాలలో ఏభై శాతం వరకు మాత్రమే పూర్తిచేసినట్లు రికార్డుల్లో చూపుతున్నారు. నిధుల కొరత లేకున్నప్పటికీ నిర్లక్ష్యం కారణంగా నిర్దేశించిన లక్ష్యాలను అధిగమించలేక పోతున్నారన్న విమర్శలున్నాయి. జిల్లావ్యాప్తంగా చేపట్టిన పాఠశాల భవనాల వివరాలు అందజేయాలని మంత్రి ఆదేశించారు. నాణ్యతా ప్రమాణాలు పాటించక పోవడం, ఎక్కువ నిధులు కేటాయించడంపై దర్యాప్తు జరిపి, చర్యలు తీసుకొనే అవకాశం వుంది.

✍ అల్లూరు రహీం

ఐదేళ్ల క్రితం హీరో మహేష్‌బాబు, దర్శకుడు పూరి జగన్నాథ్ కాంబినేషన్‌లో వచ్చిన పోకిరి చిత్రం తెలుగు చలన చిత్ర పరిశ్రమలో అప్పటివరకున్న కలెక్షన్ల రికార్డులను తుడిచిపెట్టి ట్రెండ్ సెట్టర్‌గా నిలిచింది. లాంగ్ గ్యాప్ తర్వాత మహేష్‌బాబు, పూరిజగన్నాథ్ కాంబినేషన్‌లో ఆర్.ఆర్. మూవీ మేకర్స్ రూపొందించిన బిజినెస్ మేన్ చిత్రం కూడా ప్రేక్షకులను అలరిస్తుంది. ఈ చిత్రంలో కథ సింగిల్‌లైనే. కాని దీన్ని నవరసభరితంగా తెరపై చూపించడంలో పూరిజగన్నాథ్ విజయం సాధించాడు.




పటిష్టమైన స్క్రీన్‌ప్లే, పాటలు, మాటలు, హీరోయిన్ కాజల్ అందాల ప్రదర్శన, బోనస్‌గా ఆమె మహేష్‌బాబుకు ఇచ్చే ఘాటు ముద్దు యువప్రేక్షకులను కాస్త గందరగోళ పర్చేస్తుంది. ఈ సినిమాలో హీరో ఎలాగోలా బతికేద్దాం అనుకోడు. ఎలా బతకాలి? అనే విషయమై అతనికి కొన్ని ఆలోచనలుంటాయి. లాభం సంపాదించాలంటే ఎలాంటి ఎత్తుగడలకైనా సిద్ధంగా వుండాలి. వ్యాపారంలో అదే సూత్రం. పక్కా బిజినెస్‌మేన్ పాటించే సిద్ధాంతం ఇది. జీవితం కూడా వ్యాపారం అనుకొంటే మనం మనుగడకోసం ఎలాంటి రిస్కయినా చేయాలని దర్శకుడు ఈ చిత్రంలో హీరో చేత సందేశం కూడా చెప్పించాడు. ముంబాయిలో ఒకప్పుడున్న అండర్ వరల్డ్ డాన్లుగా విలసిల్లిన దావూద్ ఇబ్రహీం, అబూసలేం, చోటా షకీల్ లేకుండా పోవడం వల్ల ఏర్పడిన లోటును భర్తీ చేయను హీరో మహేష్‌బాబును సూర్యభాయ్‌గా చిత్రంలో రూపుదిద్దిన తీరు బాగుంది. అతని చేత పూరి జగన్నాథ్ పలికించే నేనుకొడితే అదోరకంగా వుంటుందని అనుకొంటుంటారు. యుద్ధం చేతగానివాడు ధర్మం గూర్చి మాట్లాడుతాడు. మంచితనానికి రోజులు కావివి. జీవితం ఒక యుద్ధం... బి అలర్ట్, లైఫ్‌కు గోల్ కావాలి. అది లేనివాళ్లు చచ్చిపోండి, ఏది అనిపిస్తే అది చేసేయండి డైలాగులు బాగున్నాయి. ఈ చిత్రంలో యాక్షన్ తోపాటు ప్రేమ సన్నివేశాలకు దర్శకుడు సమ ప్రాధాన్యత కల్పించాడు. ఎక్కడ నుంచి కాపీ చేశాడో తెలియదు కాని నెల్లూరీయుడు తమన్ స్వరపరచిన సార్... వస్తారే, ఓ పిల్ల చావ్, చందమామ, ఉయ్ లవ్ బ్యాడ్ బాయిస్ చరణలతో సాగే పాటలు బాగున్నాయి. హీరో మహేష్‌బాబు, దర్శకుడు పూరిజగన్నాథ్ కలసి రచ్చలే అనేపాట పాడారు. భాస్కరభట్ల సాహిత్యం పాశ్చాత్య బాణీల్లో ఖూనీ అయినా ఆయన ప్రతి పాటనూ భావార్ధంతోనే వ్రాశాడు. శ్యాం. కె.నాయుడు కెమెరా చిత్రంలో ప్రతి ఫ్రేమ్‌ను అందంగా తీర్చిదిద్దింది. విజయ్ రూపొందించిన పోరాటాలు కూడా బాగున్నాయి.




చిత్రకథలోనికి వెళ్తే ముంబాయిలో రైలు దిగి తన మిత్రుడు బ్రహ్మాజీ దగ్గరకు వచ్చే సూర్య (మహేష్‌బాబు) అతన్ని వుద్యోగం మానేయమంటాడు. ఇక నుంచి తన దగ్గర పని చేయమని తాను ముంబాయిని వుచ్చపోయించను వచ్చానంటాడు. ముందు ధారవి ప్రాంతంలో వుండే ప్రజలను బ్యాంకు రుణం నుంచి విముక్తులను చేస్తాడు. ఈ సమయంలోనే ముంబాయి పోలీసు కమిషనర్ అజయ్ భరద్వాజ (నాజర్) నగరంలో అండర్ వరల్డ్ భాయిలెవరూ లేరని ప్రకటిస్తాడు. నగరంలోని రాజకీయ నాయకుడు లాలూ (షాయాజీ షిండే)ను కలిసే సూర్య అతని శత్రువు మున్నాను జైలులో మట్టుపెట్టిస్తానంటాడు. దీనికిగాను ముంబాయిలో రౌడీషీటర్ షకీల్‌ను వాడుకొంటాడు. నగర రౌడీలకు ఒక్కొక్కరికి 50వేలు జీతం అడ్వాన్స్‌గా యిచ్చి దందా మొదలుపెట్టి సూర్యభాయ్‌గా అవతరిస్తాడు. మరోవైపు పోలీసు కమిషనర్ కుమార్తె చిత్ర (కాజల్)కు కాస్త మస్కాకొట్టి ఆమెను తన లైన్‌లో వుండేలా చేస్తాడు. సూర్యభాయ్ హల్‌చల్ తెలుసుకొన్న పోలీసు కమిషనర్ అతన్ని హెచ్చరించే ప్రయత్నం చేయగా నీ కుమార్తె నన్ను ప్రేమిస్తుందని అతడ్ని హడలగొడతాడు. సూర్య ఎక్స్‌పోర్ట్స్ కంపెనీ పేరిట దందాను దేశవ్యాప్తంగా చేస్తాడు. ఎక్కడికక్కడ స్థానిక రౌడీలు బిజినెస్ చేసుకొని తనకు రెండుశాతం కమిషన్ ఇస్తే చాలని అండర్‌వరల్డ్ బిజినెస్ మేన్‌గా అవతరిస్తాడు. కేంద్రంలో చక్రం తిప్పే మంత్రి జయదేవ్ (ప్రకాష్‌రాజ్) మనిషి అరుణ్ ఘోకలేకి పోటీగా తన మనిషి లాలూను మేయర్ ఎన్నికల్లో పోటీ చేయించి గెలిపిస్తాడు. ఢిల్లీలో పెద్ద నేత (రాజ్ మురాద్) సైతం ప్రధానిని చేయను లోక్‌సభ ఎన్నికల్లో 350 కోట్లు ఖర్చు పెట్టను సూర్యభాయ్ ముందుకొస్తాడు. జయదేవ్ చిన్నప్పుడు తన కుటుంబాన్ని వంచించడం వల్లే అతనిపై కక్ష పెంచుకొని శంకరగిరి మాన్యాలు పట్టించానని ప్రియురాలు చిత్రకు చెబుతాడు. సూర్యభాయ్ తాను అనుకొన్నట్లు బిజినెస్‌మేన్‌గా స్థిరపడడంతో చిత్రం ముగుస్తుంది. ఈ చిత్రంలో మహేష్‌బాబు చాలా కష్టపడి నటించాడు. కానీ కొన్ని చోట్ల ఆయన ముఖంలో ఫీలింగ్స్ బాగా పలకలేదు. దూకుడు చిత్రంలో, ఈ చిత్రంలో ఆయన నటన పోలిస్తే స్కోరింగ్ తక్కువనిపిస్తుంది. బిజినెస్ మేన్ వన్ మ్యాన్ షో చిత్రం కాబట్టి మిగతా నటీనటుల గూర్చి చెప్పుకోవాల్సిందేమి లేదు.

## గొడవ పడలేదు



అందాల కథానాయిక ప్రియాంక చోప్రా ఓ పాప్ అల్బమ్ రూపకల్పనలో భాగంగా ఇటీవల విదేశాలకు వెళ్లి వచ్చింది. ఇంతలో ఇక్కడ విడుదలైన డాన్-2 చిత్రంలో ఆమె పాత్రకు మంచిపేరు రావడంతో ఆనందాన్ని వ్యక్తం చేసింది. డాన్-2 చిత్రీకరణ సమయంలో ఈ చిత్రంలో మరో హీరోయిన్ లారాదత్తాతో గొడవ పడ్డారా అంటే; అదంతా అబద్ధమంది. ఈ విషయమై మాట్లాడుతూ మిస్ ఇండియా పోటీల్లో పాల్గొన్నప్పటి నుంచీ లారాతో మంచి సంబంధాలున్నాయి. మేమిద్దరం మంచి స్నేహితులం. అలాంటప్పుడు మా ఇద్దరికి గొడవెందుకొస్తుంది. అయినా మా ఇద్దరి కలయికలో వచ్చే సన్నివేశాలు కూడా లేవు. ఓ రోజు మేం కలిసి మాట్లాడుకున్నప్పుడు తన వ్యక్తిగత విషయాలు కూడా నాతో పంచుకొంది. మహేష్ భూపతి తనపై వున్న ప్రేమను ఎలా వ్యక్తంచేశాడో కూడా చెప్పింది. తనకు పుట్టబోయే బిడ్డ గురించి, ఆ చిన్నారికి సమకూర్చాల్సిన సౌకర్యాల గూర్చి చర్చించుకొన్న వాళ్లం ఎందుకు గొడవ పడతామంటుంది. నమ్ముదామా?

## సంతృప్తిగానే ఉన్నాను!



అందాల హీరోయిన్ అనుష్క నటించిన ఏ చిత్రం ఈ ఏడాది విడుదల కాలేదు. ఈ ఏడాది మాత్రం ఆమె తెలుగులో రెండు, తమిళంలో మూడు చిత్రాల్లో నటిస్తుంది. తన కెరీర్ గూర్చి వివరిస్తూ చిత్రపరిశ్రమలోకి అడుగు పెట్టి ఆరేళ్లవుతుంది. ఇప్పటికీ సినిమాకు సంబంధించిన చాలా విషయాలు నాకు తెలియవు. ప్రతిరోజూ ఏదో ఒక కొత్త విషయం నేర్చుకొంటూనే వున్నాను. నాకు లభిస్తున్న అవకాశాల పట్ల సంతృప్తిగానే వున్నాను. నేను హీరోయిన్ అవుతానని అనుకోలేదు. వరుసగా అవకాశాలతోపాటు ఎంతో గుర్తింపు సంపాదించాను. విచిత్రం ఏమిటంటే మాతృభాష కన్నడంలో ఒక్క చిత్రంలోనూ నటించలేకపోయానని చెప్పుకొచ్చింది ఈ సుందరి.

## శ్రీనువైట్లకు ఎన్టీఆర్ ఛాన్స్!



దూకుడు చిత్ర దర్శకునిగా పరిశ్రమలో ఎన్నో రికార్డులు నెలకొల్పిన శ్రీనువైట్లకు ఎన్టీఆర్ తన చిత్రానికి దర్శకత్వం వహించే అవకాశం ఇచ్చాడు. ప్రస్తుతం ఎన్టీఆర్ బోయపాటి శ్రీను దర్శకత్వం వహిస్తున్న దమ్ము చిత్రంలో నటిస్తున్నాడు. ఈ సినిమా షూటింగ్ రామోజీఫిల్మ్ సిటీలో జరుగుతుంది. దమ్ము చిత్రీకరణ చివరిదశలో వుండగా శ్రీనువైట్ల చెప్పిన కథ నచ్చడంతో ఎన్టీఆర్ ఓకే అనేశాడు. ఈ చిత్రానికి యాక్షన్ అనే పేరు ఖరారు చేసినట్లు నిర్మాత బండ్ల గణేష్ చెప్పారు. కాజల్ హీరోయిన్‌గా నటించే ఈ చిత్రానికి తమన్ స్వరాలు సమకూరుస్తున్నాడు. యాక్షన్, వినోదాంశాల మేళవింపుగా ఈచిత్రం తయారవుతుంది.

## హాలీవుడ్‌కు విమలారామన్



రాజ్, చట్టం చిత్రాల్లో బోల్డ్‌గా నటించిన హీరోయిన్ విమలారామన్‌కు తెలుగు చిత్రాల్లో అవకాశాల్లేకుండా పోయాయి. ఈ ముద్దుగుమ్మకు డ్యామ్ 999 పేరుతో తయారైన హాలీవుడ్ చిత్రంలో నటించే అవకాశం వచ్చింది. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ వాణిజ్య చిత్రాల వల్ల జనంలోకి తొందరగా వెళ్లగలం. అంతర్జాతీయ చిత్రాల మూలంగా వివిధ భాషల దర్శకులకు, చిత్ర ప్రముఖులకు మనమెవరిమో తెలుస్తుంది. 'డ్యామ్ 999' చిత్రం మరో హాలీవుడ్ చిత్రంతోపాటు రెండు బాలీవుడ్ చిత్రాల్లో నటించే అవకాశాన్ని తెచ్చిపెట్టింది. నేనేమి హాలీవుడ్, బాలీవుడ్‌కే పరిమితం కాను. ఓ నటిగా మంచి అవకాశం ఎక్కడ వచ్చినా సద్వినియోగం చేసుకొంటానంటుంది.

## రచ్చగెలిచిన తెలుగమ్మాయి



ఇంట గెలిచి రచ్చ గెలవమంటారు పెద్దలు. పదహారణాల తెలుగమ్మాయి అంజలి వరుస అవకాశాలతో తమిళ చిత్ర పరిశ్రమలో స్థిరపడింది. ఆమె తమిళంలో నటించిన అంగాడి తెరు, ఎంగేయుమ్ ఎప్పోదుమ్ చిత్రాలు షాపింగ్‌మాల్, జర్నీ పేరుతో తెలుగు ప్రేక్షకుల ముందుకు రాగా విజయం సమకూర్చిపెట్టారు. ఈ విషయమై అంజలి మాట్లాడుతూ తెలుగులో ఫోటో, ప్రేమలేఖ రాశా చిత్రాల్లో నటించినా గుర్తింపు రాలేదు. తమిళంలో ఆదరించారు. మనలో ఎంత ప్రతిభ వున్నా సరైన సమయంలో సరైన అవకాశాలు కూడా రావాలి. దేవుడి ఆశీస్సులు, అదృష్టం, ప్రేక్షకుల ఆదరణతో ముందుకు సాగుతున్నాను. ఈ ఏడాది మరో మూడు తమిళ చిత్రాల్లో నటిస్తున్నట్లు అంజలి చెప్పింది.

# కొత్తవేషగాళ్లు వచ్చేశారు!

## వీళ్లకు సాటిలేరు


నెల్లూరు చెరువు వద్ద బొంగరాల ఆటాడుతున్న వివేకానందరెడ్డి.

సంక్రాంతి పండుగంటేనే హరిదాసులు, గంగిరెద్దుల వాళ్లు గుర్తుకొస్తారు. హరిదాసు కీర్తనలు, గంగిరెద్దులను ఆడించేవారే కనుమరుగైపోతుంటే అన్ని వేషాలు తాము వేస్తామంటూ నేతలు వచ్చేయడంతో వాళ్ళు పోయి వీళ్లు వచ్చినట్లయ్యింది. మన ప్రజాప్రతినిధులు వేసే చిత్రవిచిత్ర వేషాలు, ప్రదర్శించే టక్కుటమార విద్యల ముందు పొట్టకూటి కోసం, చారెడు గింజల కోసం తిరిగే వీళ్లందరూ ఎందుకు పనికి రాకుండా పోతున్నారు. గాలిపటాలు ఎగురవేయడం దగ్గర్నుంచి ముగ్గులు పెట్టడం, గొబ్బెమ్మల ఆటపాటల్లో తాము ఎందులోనూ ఎవరికి తీసిపోమంటూ మన ప్రజాప్రతినిధులు కొందరు చేసే విన్యాసాలు, వేసే వేషాలు నగర ప్రజలకు నవ్వు తెప్పిస్తున్నాయి. బుడబుక్కుల వాళ్లు, పిట్టల దొరల్లాగా ఏ వేషాన్ని వదలకుండా అన్ని అవతారాలు వేస్తామని, మాముందు ఇలాంటి బడుగులు, నాలుగుమెతుకుల కోసం పాకులాడే వారు బలాదూర్ అంటూ దశావతారాలను ప్రదర్శిస్తున్నారు. గుడ్డల అంగళ్ల ప్రారంభోత్సవాలకు పోయి చీర కట్టుకొని అటు ఇటు కాని వాళ్లలా ప్రవర్తించే నేతల ఫీట్లు, పాట్లు చూసిన నగర వాసులకు పండుగలనాడు సాంప్రదాయంగా వచ్చే వాళ్లు కనుమరుగు అయిపోతుండడం కొంత బాధ కల్గిస్తుంటే, మరోవైపు నేతలే అన్ని రకాల అవతారాలు ఎత్తుతుండడం పట్ల ప్రజలు అసహ్యించుకొంటున్నారు. మొత్తం మీద రానున్న రోజుల్లో మురుగు కాలువ పనుల దగ్గర్నుంచి ప్రతి పని, ప్రతి వేషాన్ని నేతలే వేసి పగటి వేషాలతో కడుపునింపుకొనే వారి పొట్టకొట్టడం ఖాయంగా కన్పిస్తోంది.

# స్వర్ణభారత్‌లో సంక్రాంతి సంబరాలు

వెంకటాచలంలోని స్వర్ణభారత్ ట్రస్టులో సంక్రాంతి సంబరాలు ఘనంగా జరిగాయి. ఈ సంక్రాంతి సంబరాలకు ముఖ్యఅతిథిగా కర్నాటక ముఖ్యమంత్రి సదానందగౌడ హాజరైనారు. ఈయనతో పాటు సినీనటులు జగపతిబాబు, ధర్మవరపు సుబ్రహ్మణ్యం దర్శకుడు కె.రాఘవేంద్రరావు, గజల్ శ్రీనివాస్ తదితరులు పాల్గొన్నారు. మహిళలకు ముగ్గుల పోటీలు, విద్యార్థులకు వివిధ అంశాలపై వ్యాసరచన పోటీలు నిర్వహించి విజేతలకు బహుమతులు అందజేశారు. ముఖ్యఅతిథిగా హాజరైన కర్నాటక ముఖ్యమంత్రి సదానందగౌడ మాట్లాడుతూ వెంకయ్యనాయుడు ఆశీస్సులతోనే తాను ముఖ్యమంత్రిని కాగలిగానని చెప్పుకొచ్చారు. జాతీయస్థాయి నేత హోదా కలిగిన వెంకయ్య ఇక్కడ పలు సేవా కార్యక్రమాలు నిర్వహించడం అభినందనీయమన్నారు.

స్వర్ణభారత్ ట్రస్టు ద్వారా జిల్లాలోని నిరుద్యోగులకు స్వయం ఉపాధిలో శిక్షణ కార్యక్రమం ఏర్పాటుచేసి ఉపాధి చూపేందుకు కృషి చేస్తున్నారని కొనియాడారు. సినీనటుడు జగపతిబాబు మాట్లాడుతూ తాను సినీ పరిశ్రమలోకి ప్రవేశించినప్పుడు ఎదురైన చేదు అనుభవాలను వివరించారు. పరిశ్రమకు పనికి రానని చెప్పిన వారే ఆ తర్వాత వారు నిర్మించే చిత్రాలలో నటించమని కోరారని గుర్తు చేశారు. మరో నటుడు ధర్మవరపు సుబ్రహ్మణ్యం తన హాస్యంతో ప్రేక్షకులలో నవ్వులు పూయించారు. ఈ కార్యక్రమానికి వెంకయ్యనాయుడు అధ్యక్షత వహించగా మేనేజింగ్ ట్రస్టీ దీపా వెంకట్ వందన సమర్పణ చేశారు.



సమావేశంలో మాట్లాడుతున్న వెంకయ్యనాయుడు.

# పొదుపు మహిళలకు గ్యాస్ కనెక్షన్లు

గత మూడు సంవత్సరాల నుంచి కళ్లుకాయలు కాచేలా ఎదురుచూస్తున్న పొదుపు మహిళలకు సంక్రాంతి కానుకగా గ్యాస్ కనెక్షన్లు మంజూరు కానున్నాయి. ఈ మేరకు కేంద్రప్రభుత్వం సంబంధిత ఆయిల్ కంపెనీలకు ఉత్తర్వులు జారీ చేయడం జరిగింది. దీపం పథకం పేరుతో అర్హులైన స్వయం సహాయక సంఘాల సభ్యులకు గ్యాస్ కనెక్షన్లు అందజేస్తారు. కేంద్రప్రభుత్వం రాష్ట్రానికి దాదాపు 70 వేల కనెక్షన్లు మంజూరు చేసింది. వీటిని జిల్లాల వారీగా 3వేల వంతున కేటాయించింది. మన జిల్లాలోని 46 మండలాల్లో అర్హులైన వారున్నారు. వీరే కాకుండా నెల్లూరు, కావలి, గూడూరు, వెంకటగిరి మునిసిపాలిటీలలో కూడా గ్యాస్ కనెక్షన్లు అందజేయాల్సి వుంటుంది. ప్రభుత్వ లెక్కల ప్రకారం మండలానికి 50 కనెక్షన్లు మంజూరు చేస్తారు. మండలానికి కేటాయించే వాటిలో రాజకీయ సిఫార్సులకే అధిక ప్రాధాన్యత ఇస్తారు. దీంతో వివాదాలు చోటు చేసుకొనే అవకాశం వుంది.

# మహిళా ఓటర్లే ఎక్కువ!

**ముసాయిదా జాబితాలో 9,52,441 మందిగా నమోదు**


సింహపురిలో సింహాభాగం అతివలదే.

జిల్లాలో ఓటర్ల ముసాయిదా జాబితాను అధికారులు ప్రకటించారు. మొత్తం ఓటర్లు 18,74,350 మందిగా తేల్చారు. గత జాబితాతో పోలిస్తే 49 వేల మంది కొత్త ఓటర్లు నమోదయ్యారు. గత ఏడాది అక్టోబర్ నుంచి ఓటర్ల జాబితా మార్పులు, చేర్పులు చేపట్టారు. తొలగింపు సంగతి ఎలా వున్నా కొత్తగా నమోదైన వారే అధికంగా వుండడం విశేషం. గత జాబితాలో మొత్తం ఓటర్లు 18,24,643 మందిగా నమోదై వుండగా కొత్తగా ప్రకటించిన జాబితాలో 49,677 మంది కొత్తగా నమోదు కావడంతో ఈ సంఖ్య 18,74,350కు చేరుకుంది. జిల్లాలోని పది నియోజకవర్గాలలో కోవూరు నియోజకవర్గంలో అధికంగా 2,08,293మంది ఓటర్లు వుండగా, నెల్లూరు నియోజకవర్గం ఓటర్ల సంఖ్యాపరంగా మిగతా నియోజకవర్గాల్లో కంటే తక్కువగా వుంది. ఇక్కడ 1,65,290 మంది ఓటర్లున్నారు. కావలి నియోజకవర్గంలో మొత్తం ఓటర్లు 1,91,628 వుండగా వీరిలో మహిళలు 98,261, పురుషులు 93,262 మంది. సర్వేపల్లి నియోజకవర్గంలో మొత్తం ఓటర్లు 1,79,449 మందికాగా, మహిళా ఓటర్లు 90,983 మంది, పురుష ఓటర్లు 86,492. ఆత్మకూరు నియోజకవర్గంలో మొత్తం ఓటర్ల సంఖ్య 1,81,181 మంది. వీరిలో మహిళా ఓటర్లు 91,362, పురుషులు 89,733. నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో మొత్తం ఓటర్లు 1,56,229 మంది మహిళ ఓటర్లు 94,195, పురుషులు 91,978 మంది. గూడూరు నియోజకవర్గంలో మొత్తం ఓటర్లు 1,85,960 మంది వుండగా మహిళా ఓటర్ల సంఖ్య 95,556, పురుషులు 90,373 మంది. సూళ్లూరుపేట నియోజకవర్గంలో మొత్తం ఓటర్లు 1,94,668 మంది మహిళలు 98,858, పురుష ఓటర్లు 95,732 మంది వున్నారు. వెంకటగిరి నియోజకవర్గంలో మొత్తం ఓటర్లు 1,89,169 మందికాగా, మహిళలు 95,446 పురుష ఓటర్లు 93,662 మందిగా నమోదయ్యారు. ఉదయగిరి నియోజకవర్గంలో మొత్తం ఓటర్లు 1,92,433 మంది వుండగా వీరిలో మహిళా ఓటర్లు 96,668 పురుషులు 95,570. కోవూరు నియోజకవర్గంలో మొత్తం ఓటర్లు 2,08,293 వీరిలో మహిళా ఓటర్లు 1,07,663, పురుషులు 1,00,517 మంది, నెల్లూరు నియోజకవర్గంలో మొత్తం ఓటర్లు 1,65,290 కాగా వీరిలో మహిళా ఓటర్లు 83,449, పురుష ఓటర్లు 81,762 మంది వున్నారు. మొత్తం ఓటర్ల సంఖ్య 18,74,350కాగా వీరిలో మహిళా ఓటర్లు 9,52,441 పురుష ఓటర్లు 9,21,081 మొత్తం మీద చూస్తే పురుషుల కంటే మహిళా ఓటర్లే అధికంగా వున్నారు.

# ఆగని బ్లాక్ టిక్కెట్ల హవా!


నగరంలోని ఓ సినిమా హాల్ వద్ద బ్లాక్ టిక్కెట్ల అమ్మకం.

నగరంలోని సినిమా హాళ్లలో బ్లాక్ టిక్కెట్ల జోరుకు అడ్డూఅదుపు లేకుండా పోతోంది. ఉన్నతాధికారులు ఎన్ని హెచ్చరికలు చేసినా ఫలితం లేకుండా పోతుండడంతో సగటు ప్రేక్షకుడు సినిమా చూడలేని పరిస్థితి ఎదురౌతోంది బ్లాక్ టిక్కెట్ల మూలంగా. మొదటి నుంచి నగరంలో సినిమాపై మోజు వున్నవారు అధికం. కొత్త సినిమా విడుదలైతే మొదటి ఆట చూసేందుకు ప్రతి ఒక్కరూ ఉత్సాహపడతారు. అలాంటిది తమ అభిమాన నటుడి సినిమా విడుదలైతే ఆ ఆనందం అంతా ఇంతా కాదు. వీరి అభిమానాన్ని తమకు అనుకూలంగా మలచుకొని బ్లాక్ టిక్కెట్లను అధిక ధరలకు విక్రయించి సొమ్ము చేసుకొంటున్నారు కొందరు. సాధారణంగా బ్లాక్ టిక్కెట్లు విక్రయించేవారు కాకుండా అభిమాన సంఘాల ముసుగులో కొందరు, రాజకీయ అండదండలున్న వారు, చోటా నేతలు రంగ ప్రవేశం చేసి అధికంగా టిక్కెట్ల తమ చేత పట్టుకొని వాటిని తమ ఇష్టానుసారంగా అధిక మొత్తాలకు విక్రయించి జేబులు నింపుకొంటున్నారు. వీరు తెలివిగా అడ్వాన్సు బుకింగ్ పేరిట టిక్కెట్లను బల్క్‌గా కొనుగోలు చేయడంతోపాటు ఈసేవా కేంద్రాలలోనూ వందల సంఖ్యలో టిక్కెట్లు తీసుకొని వాటిని బ్లాక్‌లో విక్రయిస్తున్నారు. సాధారణంగా ఈసేవా కేంద్రాలకు వెళ్లి టిక్కెట్ తెచ్చుకొనే వారికి కొన్ని టిక్కెట్లే ఇవ్వాల్సి వుంది. కానీ వందల సంఖ్యలో మూడు నాలుగు రోజులకు ఒక్కరే టిక్కెట్లు తీసుకోవడం వెనుక కొందరు ఆనం అనుచరులు, అభిమాన సంఘాల నేతలమని చెప్పుకొనే వారు వున్నట్లు సమాచారం. వీరికి పోలీసు సహకారం వుంటుండడంతో విచ్చలవిడిగా టికెట్లను బ్లాక్‌లో అమ్మేస్తున్నారు. ఇటీవల విడుదలైన మహేష్‌బాబు బిజినెస్‌మేన్ సినిమా టిక్కెట్టు మొదటిరోజు 40రూపాయల టిక్కెటు 400 రూపాయలు, 60 రూపాయల టిక్కెట్ 600 రూపాయలకమ్మారంటే ఎంతగా బ్లాక్ టిక్కెట్లు విక్రయాలు జరుగుతున్నాయో అర్థమవుతుంది.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

గోదారంగనాథ కళ్యాణంతో పరిసమాప్తమయ్యింది. సంస్కృత పండితులు కె.వై.సంపత్‌కుమారాచార్యులు ఆండాళ్ విరచిత దివ్య ప్రబంధం నుంచి 30 పాశురాలను రోజుకొకటి చొప్పున హృద్యంగా ప్రవచనం చేశారు. తిరుమల తిరుపతి దేవస్థానం ఆళ్వార్ దివ్య ప్రబంధ ప్రాజెక్ట్ సౌజన్యంతో ఈ కార్యక్రమం జరిగింది.

## రవీంద్రభారతి స్థల దురాక్రమణ కాదు

రమేష్‌రెడ్డి నగర్‌లోని మునిసిపల్ నీళ్ల ట్యాంక్ స్థలాన్ని రవీంద్రభారతి స్కూల్ యాజమాన్యం దురాక్రమించిందని గత వారం మేము ప్రచురించిన వార్తపై ఆ స్కూల్ యాజమాన్యం ఒక వివరణ పంపింది. తాము మునిసిపల్ స్థలాన్ని దురాక్రమించలేదని, తమ స్థలంలోనే కొత్తగా ప్రహరీ గోడ కట్టుకొన్నామని వివరించారు వారు. మార్తు వెంకట సుబ్బారెడ్డి కుటుంబానికి చెందిన స్థలాన్ని ముంగమూరు గోపి కొనుగోలు చేసి తమకు విక్రయించాడని ఆ స్థలంలో పాతకాలం బావి ఒకటి ఉన్నందు వల్ల ఇంతకాలం ఆ స్థలాన్ని వదలి పెట్టి ఉన్నామని, ఇప్పుడు ఆ బావిని పూడ్చి, ప్రహరీ నిర్మించామని స్కూల్ యాజమాన్యం చెప్తున్నది. తాము మునిసిపల్ స్థలాన్ని దురాక్రమించామని కొందరు గిట్టని వారు చేస్తున్న ప్రచారంలో నిజం లేదన్నది వారి అభిప్రాయం.

## తాటాకులకు డిమాండ్

భోగి పండుగ సందర్భంగా నగరంలో తాటాకులకు డిమాండ్ ఏర్పడింది. ఒక్కో తాటాకు పది రూపాయలు పెట్టి కొనుగోలు చేసేందుకు సిద్ధమైనా దొరక్కపోవడంతో నగరవాసులు వీటి కోసం తిరగాల్సి వచ్చింది. కొందరు ఇవి దొరక్కపోవడంతో చెత్తకాగితాలతో భోగిమంటవేయగా, మరికొందరు యధావిధిగా టైర్లు తగులపెట్టడంతో కాలుష్యం వెదజల్లింది. మధ్యాహ్నం వరకు టైరు వాసనకు ప్రజలు ఇబ్బంది పడాల్సి వచ్చింది.

## జోరుగా కోడిపందాలు

సంక్రాంతి పండగను పురస్కరించుకొని జిల్లాలో కోడిపందాలను జోరుగా నిర్వహించారు. ఇందుకూరుపేట, తోటపల్లి గూడూరు, ముత్తుకూరు, రూరల్, తడ, మనుబోలు మండలాలతో పాటు వివిధ ప్రాంతాలలో ఈ పందాలు పెద్ద ఎత్తున నిర్వహించారు. జిల్లాలోని వివిధ ప్రాంతాలతోపాటు ప్రక్క జిల్లాల నుంచి పెద్ద సంఖ్యలో పందాలకు రావడంతో ఆయా ప్రాంతాలు క్రిక్కిరిసిపోయాయి. లక్షల రూపాయలు చేతులు మారిన ఈ పందాలను అడ్డుకోవడంతో పోలీసులు విఫలమయ్యారనే చెప్పాలి.

## కోడిపందెం నిర్వహణకు ఫీజు!

కోడి పందాల నిర్వాహకులను అరెస్ట్‌చేస్తామని ఎస్పీ ప్రకటిస్తే ఇందుకూరుపేట పోలీసులు కోడిపందాలు నిర్వహణకు ఒక స్థలం కేటాయించి ఒక్కో కోడి పుంజు యజమాని వద్ద వెయ్యి రూపాయలు ఫీజు వసూలు చేశారు. ఇందుపూరమ్మ గుడి సమీపంలో ఏర్పాటుచేసిన వేదిక వద్ద లక్షలాది రూపాయలు పందెం కాచి నిర్భయంగా కోళ్లను వదిలారు వీటి నిర్వాహకులు. దీనివల్ల ఇందుకూరుపేట పోలీసులు సంక్రాంతిని ఘనంగా చేసుకొన్నారు.

## ఏసిబి డిఎస్పీగా భాస్కర్‌రావు

నెల్లూరు ఏసిబి డిఎస్పీగా భాస్కర్‌రావు నియమితులయ్యారు. ఇక్కడ పనిచేస్తుండిన శరత్‌బాబు బదలీపై వెళ్లగా ఆయన స్థానంలో గుంటూరులో డిఎస్పీగా పనిచేస్తున్న భాస్కర్‌రావును ఇక్కడకు బదలీ చేశారు. ఈయన గతంలో ఇదే విభాగంలో సిఐగా పనిచేసి ఉన్నారు. 13వ తేది బాధ్యతలు చేపట్టిన భాస్కర్‌రావు అవినీతి నిర్మూలనకు తన వంతు కృషి చేస్తానని చెప్పారు.

## హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్‌లో మంటలు

హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్‌లో మంటలు రేగడంతో ప్రయాణీకులు భయభ్రాంతులకు గురయ్యారు. 16వ తేది చెన్నై వెళ్తున్న ఈ రైలు నెల్లూరుకు వచ్చేసరికి త్రిటైర్ ఎసి బోగీలో మంటలు రావడంతో దానిని గంట సేపు నిలిపి మరమ్మత్తులు చేసిన అనంతరం తిరిగి బయలు దేరింది. అదృష్ట వశాత్తు ఎవరికి ప్రమాదం జరగలేదు.

## కోనలో తప్పిపోయి దొరికిన యువకులు

పెంచలకోన లక్ష్మీనరసింహస్వామి దర్శనానికి వెళ్లిన యువకులు తప్పిపోయి దొరకడం కలకలం రేపింది. చేజర్ల మండలానికి చెందిన ఐదు మంది యువకులు కోనకు వెళ్లి దైవదర్శనం అనంతరం జలపాతాల వద్దకు వెళ్లారు. ఆ సమయానికి చీకటి పడడం, అడవిలో జంతువుల అరుపులు వినడంతో భయభ్రాంతులకు గురైన వీరు దారితప్పిపోయారు. తమ పరిస్థితిని సెల్‌ఫోన్‌ల ద్వారా తల్లితండ్రులకు సమాచారం అందించడంతో వారు ఆలయ ఛైర్మన్ రవీంద్రరెడ్డి దృష్టికి తీసుకొని వచ్చారు. స్పందించిన ఆయన ఎస్‌ఐ వెంకట్రావు, తదితరులకు సమాచారం అందించి వెతికించడంతో పోలీసులు వారిని సురక్షితంగా తీసుకొని రావడంతో అందరూ ఊపిరి పీల్చుకొన్నారు.

## లేగుంటపాడులో ఎడ్ల పందాలు

సంక్రాంతిని పురస్కరించుకొని ప్రతి ఏడాది కోవూరు మండలం లేగుంటపాడులో ఎడ్లపందాలు నిర్వహించడం పరిపాటి. ఈ దఫా వీటిని అట్టహాసంగా నిర్వహించారు. దాదాపు 21 ఎడ్ల జట్లు పాల్గొన్న ఈ పోటీలలో లేగుంటపాడుకు చెందిన శంకరయ్య ఎద్దులు విజేతలుగా నిలిచాయి. ఈ పోటీల సందర్భంగా ఒకటి రెండు బండ్లు జనం మీదకు రావడంతో స్వల్పంగా గాయపడ్డారు.

## గ్యాస్ ఏజెన్సీల్లో వివేకా హల్‌చల్

రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి మొన్న డిఎస్‌ఓ కార్యాలయానికి వెళ్లి అధికారులను గ్యాస్ సిలిండర్ల సరఫరాపై నిలదీశారు. బ్లాక్‌లో సిలిండర్లు అమ్ముకొంటుంటే మీరేం చేస్తున్నారంటూ డిఎస్‌ఓ ఉమామహేశ్వరరావును నిలదీశారు. అక్కడి నుంచి శుభ గ్యాస్ ఏజెన్సీ, పద్మశ్రీ గ్యాస్ ఏజెన్సీలకు వెళ్లి తనిఖీలు చేయడంతోపాటు స్వయంగా వినియోగదారులు చేసే ఫోన్‌కాల్స్‌ను రిసీవ్ చేసుకొన్నారు. ఈ సందర్భంగా పలువురు గ్యాస్ ఏజెన్సీలపై ఫిర్యాదు చేశారు. ఉన్నట్లుండి ఎమ్మెల్యే గ్యాస్ ఏజెన్సీలపై పడడం చర్చనీయాంశమయ్యింది.




బుజబుజనెల్లూరులోని పినాకినీ యూత్ వెల్ఫేర్ అసోసియేషన్ సంక్రాంతి సందర్భంగా నిర్వహించిన ముగ్గులపోటీలో విజేతలకు బహుమతులు పంచుతున్న అమరావతి కృష్ణారెడ్డి, నిర్మల ఏజన్సీ అధినేత నరసింహారెడ్డి, యాదవ సంఘనేత దేవరాల సుబ్రహ్మణ్యం తదితరులు.

## విలేఖరి ప్రకాష్ మరణం

తడ ఆంధ్రజ్యోతి విలేఖరి ఆర్.ఎమ్.ఎస్. ప్రకాష్‌బాబు 16వ తేది మరణించాడు. ఆయన వయస్సు 54 సంవత్సరాలు. ప్రకాష్ గత పాతికేళ్లుగా ఆంధ్రజ్యోతి విలేఖరిగా పని చేస్తున్నాడు. చేసేది చిన్న ఉద్యోగమైనా నిఖార్సైన జీవితం గడిపాడు. విలేఖరిగా అందరి నుంచి గౌరవ మర్యాదలు పొందగలిగాడు. విద్యార్థి దశ నుంచి అభ్యుదయ భావకుడు. రక్తదానం వంటి సేవా కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనేవాడు. వృత్తిపరమైన నిబద్ధత, నిజాయితీని చివరి వరకు కాపాడుకొన్నాడు. ప్రకాష్ కుటుంబం మొత్తం పత్రికా రంగంతో ముడిపడినది కావడం విశేషం. ఆయన తండ్రి పాతకాలంలో దిన పత్రికలకు విలేఖరిగా పని చేశాడు. ఆయన సోదరులిద్దరూ ఆంధ్రజ్యోతి సంపాదక వర్గంలో సభ్యులు.

ప్రకాష్‌కు భార్య, ఒక కుమార్తె, ఒక కుమారుడు.

## పిచ్చిరెడ్డి అత్త మరణం

నెల్లూరు సిపిఆర్ కళ్యాణ మండపం అధినేత చెరుకుపల్లి పిచ్చిరెడ్డి అత్త మచ్చాల లక్ష్మీదేవమ్మ (బుజ్జమ్మ) 16వ తేది మరణించారు. ఆమెకు 85 సంవత్సరాలు. లక్ష్మీదేవమ్మకు ఇద్దరు కుమారులు, కుమార్తె ఉన్నారు. ఆత్మీయులను కోల్పోయిన పై రెండు కుటుంబాల వారికి మా సానుభూతి.

## కస్తూరిదేవి విద్యాలయం

16వ పేజీ కొరవ

వచ్చిన యువకుడు. ఆయన స్వగ్రామం కోట దగ్గర జరుగుమిల్లి. కృష్ణారెడ్డి వ్యాపారంతో పాటు లయన్స్ క్లబ్ కార్యకలాపాలలో చురుకుగా పాల్గొంటూ వుంటాడు. లయన్స్ క్లబ్ గవర్నర్‌గా కొంతకాలం పని చేశాడు. ఇప్పుడు లయన్స్ క్లబ్ అంతర్జాతీయ బోర్డులో ఆర్థిక వ్యవహారాల ప్రతినిధిగా ఉన్నత స్థానంలో వున్నాడు.

నందనారెడ్డి తన తాత వదాన్యతతో నెలకొన్న కస్తూరిదేవి విద్యాలయాన్ని పునరుజ్జీవింప చేయాలనే సత్సంకల్పంతో యాజమాన్య కమిటీలో సభ్యురాలిగా చేరారు. కృష్ణారెడ్డితో తనకున్న స్నేహంతో, ఆయన సహకారం వుంటే, ఈ పాఠశాలను మరింత త్వరగా వృద్ధి చేయవచ్చుననే ఉద్దేశంతో ఆయన్ను కమిటీలో చేర్చారామె.

స్వార్థం లేని మనసుతో కమిటీలోకి వస్తున్న ఈ ఇద్దరు ప్రముఖులకు స్వాగతం చెప్తున్నాము. ఎంతో చరిత్ర కలిగిన కస్తూరిదేవి విద్యాలయానికి వీరి సారధ్యంలో పూర్వ వైభవం వస్తుందని ఆశిద్దాము.

## జనవాణి

2వ పేజీ కొరవ

దమ్ము కేవలం రాజ మండ్రి నింబిల్స్, వైజాగ్‌కు చెందిన పోలార్ స్టార్ జట్లకు మాత్రమే వుండేది. పోలార్ స్టార్‌కు చెందిన పోతారెడ్డి గారు విశ్వోదయ కాలేజి గ్రౌండ్స్‌లో పులిలాగా విజృంభించి ఆడేవారు. ఎంతో కీర్తిగల బిట్రగుంట ఫుట్‌బాల్ గ్రౌండ్ నేడు బర్రెలు కట్టుకొనే స్థలంగా మారిందని 'జమీన్‌రైతు'లో వార్త చూసి హృదయం బరువెక్కింది. జిల్లాలోని క్రీడాకారులు ఈ గ్రౌండ్‌ను కాపాడుకొనే యత్నంలో ఒకటయ్యి ప్రజాప్రతినిధులపై ఒత్తిడి తేవాల్సి వుంది.

ప్రొఫెసర్ నాగరాజారావు హైదరాబాద్

## కాంగ్రెస్‌ను మట్టి కరిపించాలి!

ఉత్తరప్రదేశ్, గోవా, పంజాబ్, ఉత్తరాఖండ్, మణిపూర్ రాష్ట్రాల్లో అసెంబ్లీ ఎన్నికలు జరుగుతున్నాయి. కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం తన పాలనలో ప్రజలకు ఒరగ బెట్టిందేదీ లేదు. పీకల్లోతు అవినీతిలో ప్రభుత్వం మునిగిపోయింది. ప్రధాని మన్మోహన్ సింగ్ స్వతం త్రంగా ఆలోచించలేరు. సోనియాగాంధీ ఆలోచన లన్నీ సలహాదారులవే. చిదంబరం, గులాంనబీ అజాద్‌లు సచ్చరితులు కాదు. ఎన్నికలు జరిగే ఐదు రాష్ట్రాలలో కాంగ్రెస్ ఓడిపోతే కేంద్ర ప్రభుత్వ ఆలోచనా సరళి అయినా మారుతుంది.

వాస్తు రామచంద్ర నెల్లూరు

# వైద్య ఆరోగ్య శాఖలో వర్గపోరు!



నెల్లూరులోని జిల్లా వైద్యఆరోగ్య శాఖాధికారి కార్యాలయం.

**వైద్య ఆరోగ్య శాఖలో ఉన్నతాధికారులు, సిబ్బంది రెండు వర్గాలుగా చీలిపోయి కుమ్ములాడుకొంటుండడంతో ప్రజలకు వైద్యం గగన కుసుమమయ్యింది.**

వైద్యఆరోగ్యశాఖలో అధికారులు, సిబ్బంది మధ్య నెలకొన్న వర్గ విభేదాల ప్రభావం జిల్లా ప్రజలపై పడుతోంది. ఫలితంగా పలు ప్రాంతాల్లోని ప్రజలు రోగాల బారిన పడి ప్రాణాలు కోల్పోవాల్సి వస్తోంది. ఉన్నతాధికారుల అండదండలతో సిబ్బంది రెండు గ్రూపులుగా చీలిపోయి కుమ్ములాడుకొంటుండడంతో ఆశాఖ పనితీరు గాడి తప్పింది. దీనికి సంబంధించిన వివరాలు ఇలా వున్నాయి. ఇటీవల ఆశాఖలో సిబ్బంది బదలీల విషయమై ఏఓ, యూనియన్ నేతలకు మధ్య పొరపొచ్చలు తలెత్తాయి. ఏఓ అవినీతికి పాల్పడుతూ తమను వేధిస్తున్నాడని యూనియన్ నేతలు ఆరోపణలకు దిగారు. దీనికి ప్రతిగా ఏఓ సైతం ఉద్యోగ సంఘాల నేతలపై ప్రతి విమర్శలు చేశారు. పోరు అధికమై వైద్య ఆరోగ్యశాఖలో సిబ్బంది రెండుగా చీలిపోయారు. వీటిని నివారించాల్సిన ఆశాఖ ఉన్నతాధికారులు ఇరువురూ ఆ పని చేయకుండా వర్గపోరును పెంచేలా ఏఓ పక్షాన ఒకరు, యూనియన్ నేతల పక్షాన మరొకరు చేరి వారికి అండదండలు అందిస్తుండడంతో ఈ పోరు మరింతగా రగులుకొంది. ఆ ప్రభావం సిబ్బంది పనితీరుపై పడుతోంది. గ్రూపులుగా విడిపోయి కొట్లాడుకుంటుండడానికే సమయం సరిపోతుండడంతో ఇమ్యునైజేషన్ కార్యక్రమం అమలుకు నోచుకోవడం లేదు. సిబ్బందిని గాడిలో పెట్టేందుకు జిల్లా వైద్యఆరోగ్యశాఖాధికారి ఆకస్మిక తనిఖీలు నిర్వహిస్తూ మెమోలు జారీ చేస్తున్నా, హెచ్చరిస్తున్నా ఏమాత్రం చలనం లేకుండా పోతుంది. జాతీయ గ్రామీణ ఆరోగ్య పథకం క్రింద ఇమ్యునైజేషన్‌ను సక్రమంగా అమలు చేయాల్సి వుంది. కానీ ఎక్కడా దీనిని చేపట్టకపోవడంతో పలువురు చిన్నారులు ప్రాణాలు కోల్పోతున్నారు. ఈ కార్యక్రమం క్రింద వ్యాక్సినేషన్ చేయాల్సి వుంది. ముఖ్యంగా ఎస్సీ, ఎస్టీ కాలనీల్లో చిన్నారులకు టీకాలను వేయడం వలన ధనుర్వాతం, కంఠసర్పి తదితర రోగాల బారినపడకుండా కాపాడాల్సి వుంది. కానీ సిబ్బంది నిర్లక్ష్యం కారణంగా ఈ కేసులు బయటపడుతూనే వున్నాయి. మాసం క్రిందట గ్రిద్దలూరు పిహెచ్‌సి పరిధిలో శ్రీలక్ష్మి అనే బాలిక ధనుర్వాతంతో మృతి చెందగా, ఇటీవల నందవరం గ్రామంలో మరొకరు మరణించారు. దాదాపు నలుగురైదుగురు ఆరునెలల కాలంలో మృత్యువాత పడ్డారు. దీనికి కారణం సిబ్బంది నిర్లక్ష్యమేనన్నది బహిరంగ రహస్యం. వరిగొండ పిహెచ్‌సిలో దాదాపు 200 కిట్లు సిబ్బంది నిర్లక్ష్యం వలన పనికి రాకుండాపోయాయి అంటే పరిస్థితి ఎంత అబందరంగా మారిందో అర్థమవుతుంది. ఉన్నతాధికారులు సైతం రాష్ట్రంలో ఇమ్యునైజేషన్ కార్యక్రమం అమలులో జిల్లా చివరి స్థానంలో వుందని అక్షింతలు వేశారు. కుటుంబ నియంత్రణ పథకం అమలులోనూ ఇదే తంతు. ఇంతగా వివిధ పథకాల అమలు అటకెక్కుతున్నా, సిబ్బంది నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నా ఉన్నతాధికారులు తనిఖీల పేరుతో తిరగడం తప్ప ఎలాంటి మార్పు లేకపోవడం పట్ల విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. ముందుగా ఆ శాఖలో వర్గపోరును చక్కదిద్దితే తప్ప ప్రజల ప్రాణాలకు రక్షణ దొరకదన్నది వాస్తవం.



● కాగితాలకే పరిమితమైన

# మద్యం ఎమ్మార్పీ ధరలు!

**ఎమ్మార్పీ ధరలకే మద్యం విక్రయాలు జరపాలన్న ప్రభుత్వ ఆదేశాలు జిల్లాలో అమలు కావడం లేదు. వీటిని అమలు చేయాల్సిన ఎక్సైజ్ శాఖ వీటి విషయమై పట్టించుకోవడం లేదు.**



దిగని మద్యం ధరలు.

ఎమ్మార్పీ ధరలకే మద్యం విక్రయాలు జరపాలన్న ప్రభుత్వ ఆదేశాలు జిల్లాలో అమలు కావడం లేదు. ప్రభుత్వం జారీచేసిన ఆదేశాలను అమలు చేయాల్సిన ఎక్సైజ్ అధికారులు ఆ దిశగా ప్రయత్నాలు కూడా చేయడం లేదు. మద్యం వ్యాపారులు ఎమ్మార్పీ ధరలకంటే అదనంగానే విక్రయాలు జరుపుతున్నారు. ప్రభుత్వ ఆదేశాల ప్రకారం మద్యం విక్రయించడం కుదరదని అంటున్నారు. జిల్లావ్యాప్తంగా ఎక్సైజ్ అధికారులు, సిబ్బంది మద్యం విక్రయాలను మరింత పెంచాలని వ్యాపారులపై ఒత్తిడి చేస్తున్నారు. ఈ నేపథ్యంలో ఎమ్మార్పీ ధరలకు ఎలా విక్రయిస్తామని ప్రశ్నిస్తున్నారు. లక్షలాది రూపాయలు పెట్టుబడి పెట్టి వ్యాపారం చేస్తూ ప్రభుత్వ ఆదేశాలను పాటిస్తే నష్టాలు వాటిల్లే అవకాశం వుందని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. రాష్ట్రవ్యాప్తంగా ఎసిబి అధికారులు గత నెలలో మద్యం విక్రయాలపై దాడులు జరిపిన సంగతి తెలిసిందే. ఈ దాడుల వల్ల సిండికేట్ల గుట్టు బహిర్గతమైంది. జిల్లాలో పలు మద్యం సిండికేట్ల కార్యాలయాలపై దాడులు జరిపి కొన్ని రికార్డులను స్వాధీనం చేసుకోవడం జరిగింది. ఎసిబి అధికారులు సమర్పించిన నివేదిక ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వం వద్ద పెండింగ్‌లో వుంది. ఈ నివేదికను పరిశీలించి ఎప్పుడు చర్యలు తీసుకుంటారో వేచి చూడాల్సిందే. ఎసిబి అధికారుల దాడుల తర్వాత ఎమ్మార్పీ ధరలు అమలు చేస్తారని అందరూ భావించారు. అయితే జిల్లాలో ఏ మద్యం దుకాణంలో గానీ, బార్లలోగానీ ఈ విధానాన్ని అమలు చేసేందుకు ఎవరూ ముందుకు రావడం లేదు. ఈ బాధ్యతలను చూడాల్సిన ఎక్సైజ్‌శాఖ మద్యం వ్యాపారులతో ఒప్పందం చేసుకొని దాడులు చేయడం లేదన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి. మద్య ప్రియులు ఎమ్మార్పీ ధరల గురించి షాపుల యజమానులను ప్రశ్నిస్తే దురుసుగా సమాధానం చెబుతున్నారు. సంక్రాంతి సందర్భంగా జిల్లావ్యాప్తంగా దాదాపు 50 లక్షల రూపాయల మేర మద్యం అమ్మకాలు జరిగినట్లు అంచనా. ఎమ్మార్పీ ధరలకే మద్యం విక్రయాలు జరపాలన్న ఆదేశాలు కేవలం కాగితాలకే పరిమితమై పోయాయన్న విమర్శలు వున్నాయి.

# థానే తుపాన్ నష్టాలపై సర్వే!

**● జిల్లాలో ఇటీవల సంభవించిన థానే తుపాన్ వల్ల కలిగిన నష్టాలను సేకరించి నివేదిక పంపాలని జిల్లా అధికార యంత్రాంగాన్ని రాష్ట్ర ప్రభుత్వం కోరింది.**

థానే తుపాన్ ప్రభావంతో సంభవించిన నష్టాలపై సర్వే చేయాలని ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. గత నెలలో థానే తుపాన్ కారణంగా జిల్లాలో కొంతమేర వ్యవసాయానికి నష్టం వాటిల్లింది. జరిగిన నష్టాలపై వివరాలు సేకరించి పంపాలని ప్రభుత్వం నుంచి ఉత్తర్వులు రాకపోవడంతో అధికార యంత్రాంగం మౌనంగా ఉండిపోయింది. ఈ వారంలో ఉత్తర్వులు అందడంతో వివిధ శాఖలకు చెందిన అధికారులు నష్టాల వివరాలు సేకరించేందుకు సర్వే కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు. థానే తుపాన్ సంభవించి ఇప్పటికి దాదాపు ఇరవై రోజులు గడిచింది.

మినుము, వేరుశనగ పంటలతోపాటు తీరప్రాంత మండలాల్లో కొంత మేర వరినాట్లు దెబ్బతిన్నాయి. పంట దెబ్బతిన్న రైతులకు సకాలంలో ప్రభుత్వం సహాయం అందిస్తే వెంటనే తిరిగి పంటను వేసుకునే అవకాశం ఉంటుంది. ఇరవై రోజులు గడిచిన తర్వాత ప్రభుత్వం సర్వే చేయాలని ప్రకటించడం పట్ల బాధిత రైతులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. సర్వే ఎప్పటిలోగా పూర్తిచేసి ప్రభుత్వానికి నివేదిక పంపుతారు. ప్రభుత్వం నుంచి సహాయం ఎప్పుడు అందుతుందో దీని వలన ఎటువంటి ప్రయోజనం కలుగుతుందని రైతులు ప్రశ్నిస్తున్నారు. జిల్లా వ్యవసాయశాఖతోపాటు దీని అనుబంధ శాఖల అధికారులు కూడా సర్వే చేస్తున్నారు.

జిల్లాలో రహదారులు కూడా తుపాన్ కారణంగా దెబ్బతిన్నాయి. వీటికి కూడా ప్రతిపాదనలు పంపాలని ప్రభుత్వం కోరింది. సంక్రాంతి పండుగ తర్వాత వివిధ శాఖల అధికారులు థానే తుపాన్ నష్టంపై అంచనాలు వేసే పనిలో నిమగ్నమై ఉన్నారు.

## కస్తూరిదేవి విద్యాలయం

# కమిటీ అధ్యక్షురాలిగా నందనారెడ్డి!





కస్తూరిదేవి విద్యాలయం యాజమాన్య కమిటీలో తిక్కవరపు నందనారెడ్డి, వేణుంబాక కృష్ణారెడ్డి అనే ఇద్దరు ప్రముఖులు కొత్తగా చేరారు. ఇద్దరూ పూర్వాశ్రమంలో నెల్లూరీయులు, ప్రస్తుతం బెంగుళూరు నివాసులు.

నందనారెడ్డి, నెల్లూరువాసులు మా ఆడపడచు అని గొప్పగా చెప్పుకోతగిన మహిళ. ఉత్కృష్టమైన కుటుంబ నేపథ్యం ఆమెది. పాతతరం నెల్లూరు జిల్లా అపర కుబేరులలో అగ్రగణ్యుడిగా పేరు పొందిన తిక్కవరపు రామిరెడ్డి మనుమరాలు. నెల్లూరు జిల్లాలో తొలి కరెంట్ దీపం వెలిగింది ఆయన ఇంట్లోనే. మద్రాసులో ఆ కాలంలో చారి అండ్ కంపెనీ అనే సంస్థ విద్యుత్ సరఫరా చేసేది. వారి నుంచి నెల్లూరు వరకు తానే స్వయంగా కరెంటు స్తంభాలు నాటించి, తన ఇంటికి కరెంటు సౌకర్యం కల్పించుకొన్నారాయన. ఆ తర్వాతే కలెక్టర్ వంటి అధికారులకూ విద్యుత్ సౌకర్యం కల్గింది. నందనారెడ్డి తండ్రి తిక్కవరపు పట్టాభి, అభ్యుదయ భావకుడు, కవి, సృజనశీలి. ఫిడేలు రాగాలతో తెలుగు పద్యాలలోని చందస్సు నడ్డి విరగగొట్టిన వాడాయన. ఆమె తల్లి స్నేహలతారెడ్డి, పేరొందిన సోషలిస్ట్. ఎమర్జెన్సీ కాలంలో జార్జి ఫెర్నాండెజ్ వంటి పోరాట యోధులకు తన ఇంట్లో అజ్ఞాతవాసం కల్పించిన సాహస నారి. ఆ తల్లిదండ్రుల వారసత్వంగా నందనారెడ్డిలో కూడా సామ్యవాద భావాలు జీర్ణించుకొని పోయాయి. బెంగుళూరులో 'కన్సర్న్డ్ ఫర్ వర్కింగ్ చిల్డ్రన్' అనే సేవా సంస్థను నెలకొల్పి, అనాథ పిల్లల జీవితాలలో దీపం వెల్గించే ఆదర్శ కృషికి తన జీవితాన్ని అంకితం చేశారామె. స్త్రీవాదం పైన, అనాథ పిల్లల జీవన స్థితిగతుల మీద పలు రచనలు చేశారు. రాడికల్ హ్యూమనిస్ట్ వంటి ప్రసిద్ధ పత్రికలలో ఆమె వ్యాసాలు ప్రచురితమౌతూ వుంటాయి.

వేణుంబాక కృష్ణారెడ్డి, బెంగుళూరులో ప్రసిద్ధ రియల్ ఎస్టేట్ వ్యాపారి. స్వయంశక్తితో ఉన్నతికి

కొరవ 14వ పేజీలో


చందాదారులకు
ప్రత్యేక కానుక...


# మేకపాటితో సత్సంబంధాలు ఉన్నాయి ... వారి ఆశీస్సులే నాకు శ్రీరామరక్ష

## - కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి

జిల్లాలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలోని అందరు నాయకులతో తనకు సత్సంబంధాలు ఉన్నాయని, వాటినే భవిష్యత్తులో కొనసాగిస్తానని; ఉదయగిరి శాసనసభ్యుడు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డితో తనకు విభేదాలున్నాయని జరుగుతున్న ప్రచారం తాడు – బొంగరం లేని, ప్రజల్లో పలుకుబడిలేని తన రాజకీయ ప్రత్యర్థులు చేస్తున్న కుట్రలో భాగమని అది పూర్తిగా విషప్రచారమని కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి చెప్పారు. గడప గడపకు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీని తీసుకెళ్లాలని నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో సాగిస్తున్న 141 రోజుల మహా పాదయాత్ర ప్రచార సభలో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి తనను సొంత తమ్ముడిలా ప్రోత్సహిస్తున్నారని మేకపాటి సోదరుల ప్రోత్సాహంతోనే తాను నెల్లూరు నగరం, రూరల్‌లలో వైఎస్.జగన్మోహన్‌రెడ్డి ఓదార్పు యాత్ర విజయవంతానికి తన వంతు కృషి చేశానన్నారు. ఈరోజు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో ఇంత ఉత్సాహంగా పని చేస్తున్నానంటే మేకపాటి సోదరుల



ఆశీస్సులు, అండదండలే దానికి కారణమన్నారు. వైఎస్. జగన్ గారికి కొండంత అండగా నిలబడేందుకు అందరి కంటే ముందు తమ పదవులను సైతం వదులుకోవడానికి సిద్ధపడి రాష్ట్రంలో, దేశంలో సింహపురి కీర్తి ప్రతిష్టలు మేకపాటి సోదరులు చాటారన్నారు. మేకపాటి సోదరుల నాయకత్వంలో, కాకాణి గోవర్ధన్‌రెడ్డి పదనిర్దేశకత్వంతో జిల్లాలో అందరు నాయకుల సమిష్టి సహకారంతో కార్యకర్తల అండదండలతో, ప్రజల ఆశీస్సులతో దివంగత మహానేత వైఎస్. స్ఫూర్తితో జగనన్న బాటలో అడుగులు వేస్తూ జిల్లాలో పార్టీ అభివృద్ధికి తన వంతు తోడ్పాటు అందిస్తానని కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి చెప్పారు. పనికట్టుకొని, పసలేని విషప్రచారాలు చేసి తద్వారా మేకపాటి సోదరులకు దూరం చేసి రాజకీయంగా నన్ను బలహీనం చేసి దెబ్బ తీసేదానికి తన రాజకీయ ప్రత్యర్థులు చేస్తున్న కుటిల యత్నాలు సాగనివ్వనని వారి కలలు కల్లలుగానే మిగిలిపోతాయని మేకపాటి సోదరుల ఆశీస్సులే తనకు శ్రీరామరక్షగా నిలుస్తాయని కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి ధీమా వ్యక్తం చేశారు.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com